కుటుంబగీత

ప్రథమ ముద్రణ – భవ దీపావళి తేది 3–11–1994

ప్రతులు 500



ముఖ చిత్రం :
శ్రీ శీలావీర్రాజు

వెల : ***30-00***

ప్రతులు లభించు స్థలం :
కె. కిశోర్ బాబు–వాణీ సదనం
17-34, విద్యానగర్ కాలని,
వాగర్ కర్నూలు-509209.

ముద్రణ :
మందాకిని ప్రింటర్స్
రాంనగర్, హైదరాబాదు-48

# ఈ గీత

ఇది పదేండ్లనాటి మాట. ఒక పర్యాయం నేను కుటుంబ నియంత్రణ కవి సమ్మేళనంలో పాల్గొనటం జరిగింది. అపుడేవో పద్యాలు చదివినాను కాని అవి చదువుతూ ఉండగా దీన్నే యితివృత్తంగా చేసికొని ఒక ఖండకావ్యం ఎందుకు వ్రాయకూడదు. అనిపించి ఆతర్వాత యువతీ యువకులు - వివాహం - కుటుంబనియంత్రణ అనే మూడంశాలు ప్రధానంగా చేసికొని సుమారు మూడువందల గీతాలుగా ఒక కథను రచించి దానికి కుటుంబగీత అని పేరు పెట్టినాను.

ఆ తర్వాత సుప్తావస్థలో అది కొంతకాలం ఉన్నది. పిమ్మట పునర్విమర్శకై ఒకసారి తిరుగవేస్తుండగా దీనికి గీత అని పేరు పెట్టినాను గదా! అదే పేర్లతో దీన్ని అధ్యాయవిభజన ఎందుకు చేయకూడదు అని తోచి మొదటవ్రాసిన పద్యాలు ఏవేవి ఏఅధ్యాయక క్రిందికి ఒదుగగలవో ఎన్నుకొని విగడించి ఇకతక్కిన వానికొరకు అవసరమైన చోట్లలో క్రొత్తవిచేర్చి తుది రూపంయిచ్చినాను.

ఆ విధంగా దీనికి తుదిరూపం ఈయటంలో అధ్యాయాలలోనిపద్యాలు మూడునాలుగు తడవలు అటుయిటుగా మార్చవలసివచ్చింది. అపుడునాకు ఓపికతో దీనిశుద్ధప్రతులు వ్రాసిపెట్టినవారు. జాతీయోన్నత పాఠశాల ఉపాధ్యాయులు శ్రీ సోమిశెట్టి నరసింహులు, పాలమూరు వీరయ్యగారలు.

వీరిద్దరు నేను పని చేసిన పాఠశాలలోని ఉపాధ్యాయులు కాగా యం.డి. ఝాంగీర్, పెరుమాళ్ళ రాజరత్నం వీరిద్దరు శిష్యులు మరియు కవులు.

వీరిలో ఝాంగీర్ ప్రత్యేక శిష్యుడుకాగా రాజరత్నం శిష్యప్రాయుడు.

ఇక దీన్ని హైదరాబాద్‌లో ఉండి ప్రెస్ వర్కు చూసినవారు సి. బాలకిష్టయ్య, మహమ్మద్ ఇమాముద్దీన్ గారలు. సి. బాలకిష్టయ్య M.A.P.H.D ఇమాముద్దీను గవర్నమెంటు టెక్స్ట్ బుక్ ప్రెస్‌లో ఉద్యోగి.

వీరందరునాపై అభిమానం మరియు భయభక్తులు కలవారు వీరందరికినీ నేను ఆయురారోగ్యైశ్వర్యాలతో వర్ధిల్లాలని దీవిస్తున్నాను.



చేపూరు పెద్దలక్ష్మయ్య దంపతులు

జననం : వికారి చైత్రం 6-5-1899

మరణం : విశ్వావసు కార్తీక బ॥ షష్ఠి 14-11-1965

పత్ని లక్ష్మీనరసమ్మగారు జననం: విరోధికృతు 1910-11

వివాహం: సిద్ధార్థి ఫాల్గుణ శు॥ తదియ భానువారం 20-2-1920

మరణం: ప్రమోదూత మాఘ బ॥ తదియ శనివారం 2-2-19[illegible]

శ్లో॥ అమరావతి పురావాసం విశ్వదక్షంమయప్రతిం
చేపూరువంశ రాజీవం, ఎల్లయార్యతనూభవం,
కవిం ధన్వంతరింవందే- దైవజ్ఞం బ్రహ్మవాదినం.



రామదాసు రుక్మిణమ్మ గారు

జననం : ప్రభవ భాద్రం బ॥ ఏకాదశి, పుష్య. 2వ పాదం.
హేమాలంగి జన్మనామం. తేది 21-9-1927

వివాహం: బహుధాన్య వైశాఖ బ॥ ఏకాదశి బుధవారం మిధునలగ్న
పుష్కరాంశం 26-5-1938.

మరణం: అంగీరస మార్గ॥ శు॥ ఏకాదశి శనివారం 19-12-1992

ఉ॥ ఎక్కడి నుండివచ్చి జనియించుచు నుండెనో భూతజాలముల్
ఎక్కడికేగునో తెలియ దెవ్వరికమ్మణిసూత్రమింతయున్
చిక్కనసమస్యయోగులు విశేషముగా పరికించి చెప్పగా
పక్కనెరుంగరైరి కులపావని నీకెరుకౌను రుక్మిణీ.

సేకరణ– రామదాసుకృష్ణాచార్యులు



రామదాసు భగవంతాచార్య దంపతులు

జననం: విలంబి భాద్రపద శు॥ ఏకాదశి 18-8-1898

మరణం: అక్షయ వైశాఖ బ॥ ద్వాదశి 10-5-1926

పత్ని - కామాక్షమ్మగారు జననం: పరాభవ శ్రావణ శు॥ దశమి 5-8-1906

మరణం: దుందుభి ఆశ్వీజ బ॥ అష్టమి ఆదివారం 10-10-1982



రామదాసు కృష్ణాచార్యులు

జననం : రుధిరోద్గారి అధిక జ్యేష్ఠ శు॥ దశమి గురువారం
ఉత్తర 4వపాదం పీతాంబరయ్య జన్మనామం 29-3-1923

| | | |
|---|---|---|
| సీ॥ రోకలి దాల్చిన ప్రాకటునేమంద్రు: | ముసలి | ముసలయ్య |
| హేమలాపురమున నెవరుదేవి? | జోగుళాంబ | జోగమ్మ |
| కృష్ణశబ్దంబు వికృతినాంధ్రమందేమి? | కిష్ట | కిష్టయ్య |
| రాహువుగన్నట్టి రమణియెవరు? | సింహిక | సింగమ్మ |
| సింహంబు పురుషుడై చెలగిననేమంద్రు? | సింహుడు | సింహయ్య |
| ప్రహ్లాద భక్తుని భార్య యెవరు? | దేవి | దేవమ్మ |
| షడ్గుణపూర్ణుడై జగమందునెవడుండు? | భగవంతుడు | భగవంతయ్య |
| కంచిలో వెలసిన కాంతయెవరు? | కామాక్షి | కామాక్షమ్మ |

వారిపేర్లతో తరతరాల్ వాసిగన్న తాతతండ్రుల వంశానదనరినట్టి
కృష్ణయార్యుడిద్దానిహృష్టుడగుచు నతివ పేరున వెలయించె నక్షరముగ.

# కృతజ్ఞతలు

నేను కోరినంతనే ఈ కృతికి తమ అమూల్యాభిప్రాయాలిచ్చిన అద్భుత ప్రతిభామూర్తులు, అసమాన పరిశోధకులు, బహుభాషాభిజ్ఞులు సహృదయులైన శ్రీ తిరుమల రామచంద్రగారికి-

హృదయపూర్వకమైన కృతజ్ఞతలు-



# అధునాతన గీత

రక్తసంబంధంగల కొందరి సహజీవనం కుటుంబం. కొన్ని కుటుంబాల చేరిక గ్రామం. కుటుంబాల సంఖ్య ఎక్కువయిన గ్రామమూ పట్టణం. ఇలాంటి కొన్ని గ్రామాల పట్టణాల చేరిక జనపదం. కొన్ని జనపదాల సమూహం దేశం. ఈదేశాన్నే పూర్వం ఖండం అనేవారు. ఈఖండం విస్తృతమయితే వర్షం. ఇలాటి వర్షాలు కొన్నిచేరితే ద్వీపం. మనంనేటికీ నాటి వ్యవహారంతోనే భారతదేశాన్ని జంబూద్వీపే భారతవర్షే భరతఖండే మేరోర్దక్షిణదిగ్భాగే ఇత్యాదిగా నిత్యం స్మరిస్తుంటాము. ఏవంచ.

ప్రతి దేశానికి మూలకందం కుటుంబం. కుటుంబం అనేదాన్ని పలుకాలాల్లో పలువురు పలువిధాలుగా నిర్వచించిన దగ్గరి రక్తబంధువు. దీనిలోని ప్రధాన వ్యక్తులనడంలో ఎవరికీ విప్రపత్తిలేదు. ఈ కుటుంబం లోనివారు పరస్పరం గౌరవసద్భావాలతో ప్రవర్తిస్తున్నపుడే కుటుంబం సుఖసంతోషాలతో వర్ధిల్లుతుంది. కుటుంబాలు అన్నీ సుఖశాంతులతో ఉన్నపుడే దేశంప్రగతిని సాధిస్తుంది.

ప్రవర్తన-వ్యవహారమే కుటుంబానికి తద్వార దేశానికి శ్రేయో దాయకం.

శ్లో॥ నకశ్చిత్ కస్యచిత్మిత్రం నకశ్చిత్ కస్యచిత్రిపుః
వ్యవహారేణజాయన్తే మిత్రాణిరిపవస్తథా.

ఎవరూ ఎవరికీ మిత్రులుకారు; ఎవరూ ఎవరికి శత్రువులుకారు. ప్రవర్తనను బట్టి వ్యవహారాన్నిబట్టే మిత్రులు, శత్రువులు ఏర్పడుతారు. కనుక అందరూ అందరితోను యథోచితంగా ప్రవర్తించాలి- అని హితోపదేశ పంచతంత్రాల హితోపదేశం, ఒక కుటుంబంలోనివారు ఏలా ప్రవర్తించుకోవాలనే దాన్నివేదాలు మొదలు స్మృతి పురాణకావ్యాలా ఉద్ఘోషిస్తూనే ఉన్నాయి.

అనువ్రతఃపితుఃపుత్రో
మాత్రాభవతుసమ్మనాః

పుత్రుడు తండ్రిమాటను పాటించాలని తల్లిని హృదయంతో ప్రేమించాలని అథర్వణవేదం ఆదేశిస్తున్నది, ఒక కుటుంబంలోనివారు ముఖ్యంగా మహిళలు సంతోషంగా ఉన్నపుడే కుటుంబం మూడు పువ్వులు ఆరు కాయలుగా పెంపొందుతుంది.

శ్లో॥ శోచన్తి జామయోయత్ర వినశ్యత్యాశుతత్కులమ్
నశోచంతితు యత్రైతాః వర్ధతేతద్ధిసర్వదా॥

కుటుంబంలోని భార్య, చెల్లెలు, కూతురు, కోడలు మొదలైనస్త్రీలు దుఃఖ పడుతూంటె ఆకుటుంబం పెంపొందదు. దుఃఖపడక సంతోషిస్తూంటె వృద్ధి పొందుతుంది. అంటుంది మనుస్మృతి. కుటుంబంలోని వారు సంతోషంగా ఉండాలంటె వారి పరస్పర వ్యవహారం సౌహార్ద పూరితంగా ఉండాలి. సౌహార్దవిస్తృతికి ఎప్పటికపుడు దోహదాలు చేస్తూఉండాలి.

ఈ కుటుంబవ్యవస్థ ఎప్పుడూ ఒక్కటిగా లేదు. వుండదు. మార్పు ప్రకృతి లక్షణం. కనుక అనివార్యం. ఆమార్పును మంచికి మలచుకోడం సంఘనాయకులను బట్టి ఉంటుంది. సజాతీయ ప్రభావాలవల్ల భారతీయ కుటుంబ వ్యవస్థలోను మార్పుతప్పనిసరి అయింది.

శృ॥ దశాస్యాంపుత్రానాధేహి పతిమేకాదశం కృధి

పది మంది పుత్రులనుకను, నీ భర్తను పదకొండవ పుత్రునిగా సంభావించు అని.

"ప్రజయాహి మనుష్యః పూర్ణః" సంతానంతోనే మానవుడు సంపూర్ణుడవుతాడు. అని ఉద్ఘోషించిన వేదమే ముష్యనాశక మంత్రాలను క్లీంబీకరణ మంత్రాలను పఠించింది. (అధర్వణ వేదం) కనుక మార్పు విరుచుకొని పడిందని అత్యాయికస్థితి ఏర్పడిందని ఆందోళన పడవలసిన పనిలేదు. నేటి లక్ష్యం దశాస్య సంతానం కాదు. ద్విత్రాస్య సంతానం. ఇలా మరెన్నో మార్పులు వచ్చి మనం కాలానుగుణంగా ఆమార్పులకు తట్టుకొని వాటిని మనమంచికి వినియోగించుకొని ముందడుగు వేయడం అవసరమయింది. దీనిని గుర్తించిన శ్రీ కపిలవాయి లింగమూర్తిగారు కుటుంబ గీతను ఉపదేశించారు.

శ్రీ లింగమూర్తి గారు విద్వత్కవివరేణ్యులు, మంత్ర శిల్పాగమ శాస్త్రపారీణులు. నేడు కుటుంబ వ్యవస్థలో కలిగిన కల్లోలాన్ని గుర్తించారు. కాలానుగుణంగా ఈ మార్పుతో సంఘానికి మంచి చేకూర్చ దలచారు. కురుక్షేత్రంలో విషాదమగ్నుడైన అర్జునునికి కృష్ణుడు కనువిప్పు కలిగించడానికి అష్టాదశాధ్యాయాత్మకమయిన గీతను ఉపదేశించినట్టు పద్దెనిమిది అధ్యాయాలతో కుటుంబగీతను ఉపదేశించారు. ఒక్క ధ్యానయోగానికి ఆత్మ సంయమయోగం అని మార్పు చేయడంవినా తక్కిన అధ్యాయాలపేర్లను యథాతథంగా గ్రహించి విషయాన్ని వేరుగా వ్యాఖ్యానించారు.

ఈ కుటుంబగీతలోని అర్జునుడు కుటుంబయ్య సంతాన నిరోధానికి ఇష్టపడక విషాదయోగంలో పడుతాడు. అతని మిత్రుడు ఆత్మారామయ్య నేటి జనాభా పెరుగుతున్న దుష్పరిణామాన్ని వివరించి చివరకు అతనిని అంగీకరింప జేస్తాడు. ప్రసక్తానుప్రసక్తంగా ప్రస్తుత ప్రపంచంలో న్యాయమార్గాన జీవిక కొనసాగించి ఉత్తమమానవుడయి సద్గతులు పొందగల పెక్కు హితవులు చెబుతాడు.

ఇద్దరు పిల్లలుచాలునని వారిని ఉత్తమ పౌరులుగా తీర్చడం అవసరమని పిల్లల సంఖ్యను శాసిస్తుంది సాంఖ్యయోగాధ్యాయం కుటుంబ నియంత్రణానికి ఆధునిక పద్ధతులుఅనుసరించాలనేది కర్మయోగాధ్యాయం. ఇప్పటి శాస్త్రజ్ఞాన వివరణ జ్ఞానయోగం. జనసంఖ్య విస్తరించి విశ్వరూపం దాల్చిందని వివరించడం విశ్వరూప సందర్శనయోగం. ప్రతి పౌరుడికి అక్షరాస్యత-చదువు ముఖ్యమనడం అక్షర పరబ్రహ్మయోగం ఏ పనినైనా భగవత్ప్రీతిగా నిష్ఠతో చేయడం కర్మ సన్న్యాసయోగం. రాజకీయాలకు అతీతంగా ప్రజాసేవ చేయడం రాజవిద్యా రాజగుహ్యయోగం. ధనసంపాదన, ధనవినియోగం గురించినది విభూతియోగం. వ్యసనాలలో బడక నిగ్రహంతో ఉండడం ఆత్మసంయమన యోగం. సత్ప్రవర్తన దుష్ప్రవర్తనల మంచిచెడ్డల వివరణ దైవాసుర సంపద్విభాగయోగం దైవ దేశ, మాతాపితృపరిష్ఠుల యెడల భక్తితో ప్రవర్తించడం భక్తియోగ వంశశీలాలు తెలిసికొని సమానులతో వివాహ సంబంధాలు, స్త్రీపురుషుల వైవాహిక జీవితాన్ని సక్రమంగా నిర్వహించడం క్షేత్ర క్షేత్రజ్ఞ విభా

యోగం. సంసారాన్ని నిర్వహించడం, ఆహార విహారశుద్ధి పరిజ్ఞానం, విజ్ఞానయోగం. ఆహారాదులలో శ్రద్ధ, వేషభాషా ప్రవర్తనలలో శ్రద్ధ, నివాస విషయంలో శ్రద్ధ, శ్రద్ధాత్రయ విభాగయోగం, కులవంశాలను కాక మానవులను గుర్తించటం గుణత్రయ విభాగయోగం. అందరిలోను ప్రపంచమంతటాను భగవంతుని చూడడం పురుషోత్తమ ప్రాప్తియోగం. ఈత వచ్చిన తర్వాత బెండును వదలివేసినట్టు పరిపూర్ణత్వాన్ని పొందిన తర్వాత జ్ఞానాన్నిగూడ వదలడం మోక్ష సన్యాసయోగం. ఈ కుటుంబ జీవితంలో అంటీఅంటనట్టు ఉంటూ సన్మార్గంలో జీవిత గడపడమే రాజ యోగం. అదే ఈకుటుంబగీత ఉపదేశ పరమార్థం.

రాజయోగమనంగను ఈజగాన,
ఆలుపిల్లలు సంసార మనుటగాదు
పుట్టినందుకు సంసారముననలుపుచు
నెటుల జీవింపవలయునో యెరుగుటగును.

తనువుచేతను సంసారమును సలుపుచు
మనసుచేతను బ్రహ్మమందున వసింప
వలయున దిరాజయోగంబు వసుధలోన
అట్టివాడు జీవన్ముక్తు డగునుసుమ్మి

కనుక అడవులకో ఆశ్రమాలకో పోనక్కరలేదని, భార్యను పిల్లలను వదలి ఋషులూ సంసారంవదల్లేదు.

ఉవిద పురుషులు గూడియు నొకటిగాక
యొంటరికి పూర్ణతాసుద్ధి యొదవదిచట
వసుధనందుకె ఋషులు సభార్యలగుచు
తపము సల్పిరియాశ్రమవిపినములను. పు. 7, 9

కురుక్షేత్రంలోని గీతోపదేశవార్తను సంజయుడు ధృతరాష్ట్రునికిచెప్పినట్టు కృష్ణాచార్యుడనే జిజ్ఞాసువుకు లక్ష్మయాచార్యుడనే ఆచార్యుడు కుటుంబ గీతను చెప్పినట్లు రచించడం రచనచాతురి వైశిష్ట్యం.

శ్రీలింగమూర్తిగారు వశ్యమధురవాక్కులు కథనమాధురి, విషయ విశ్లేషణచాతురి వీరిసొమ్ము నుడికారాలను నడిపించడంలోను, జాతీయాలను జాలువార్చడంలోను, వ్యవహారపదాలకు, అన్యదేశాలకు, కవితాస్థాయి కల్పించడంలోను వారినైపుణికి ఈ ఆరువందల నలభైరెండుపద్యాలు మహావిపణి.

1. కనుపాపగ జూచుకొనుచు కన్నిమరచుచున్
2. నాటినుండియు తమయూరపీటవెట్టు-
3. లక్ష్మయాచార్య దుహితను లగ్నమయ్యె
4. సుతులకు నైధావంతము.
5. ఓయీ! నువు వ్యేసెక్టమి
6. నేటి జనసాలరేటు కుందేటిపరుగు
   సరుకురేటన తాబేటి చప్పిడినడ,
7. తగిన శ్రద్ధను చూపాలె తల్లిదండ్రి
8. కదసుమారైతు యెరుగువా గంతసీవు
9. కానన్ జగముంజుట్టును.
10. ఏడిండ్లకు నొక్కయిల్లు యేడమిగులునో
11. అడుగులేనట్టిగుమ్మి సుమ్మతని కడుపు.
12. ప్యాక్టరెరువుల నెపుడదేవనిగజల్లి
13. పడుచుపిల్లవెంట పాలటిక్కువెంట
14. లాకరునబెట్టి కట్టేయ లచ్చినెపుడు.
15. బూందుబూందు మిగుల్చని బ్రాందిపరులు
16. కోపమునకు మించు కొరివియేది
17. చీకటిబజారు ధందాలు చేయువారు
    అంధకాసురులీదాటి యరనియందు.

18. చెలుడగునో విలనగునో
బెడిసినచో చేయిచేయిపిసకుకొనుటగున్
(ఇక్కడలడల ప్రాసథైర్యంగావేశారు మొదటి
వాదంలోరప్రాస, రలడలకు అభేదంకదా!)

19. మనుజునకిక నేల ప్రేతమంగళమెగదా!

20. ఆరుమూడైన మూడారునైనగాని
సతిపతులు ముప్పదారుగా జనదెపుడును.

21. ఆరుకర్మల కులపతి యమరలవలయు
యేడుగడగాను పతియెప్పడెసగవలయు
అపుడె డెబ్బదియారుగా కరువదేడు
గాను వారల మనుగడ కళలుదేరు.

శ్రీలింగమూర్తిగారు ధ్వనిచమత్కారప్రియులు. వారి ఆరాధ్యశతక మంతా శబ్దచమత్కారాలతోనే నిండిఉంటుంది కాగా ఈ చివరిరెండు ఉదాహరణలో సంఖ్యాచమత్కారాలు చోటుచేసికున్నవి.

ఆరుమూడుకావడం నష్టం. మూడారుకావడం లాభం కనుక లాభనష్టాలురెండింటిలోగూడ సతిపతులు అన్యోన్యంగానే ఉండవలెగాని 36 సంఖ్యవలె ఒకరిముఖం ఈవైపు మరొకరి ముఖం ఆవైపుకాగూడదు.

"షట్కర్మయుక్తాకుల ధర్మపత్నీ - అని యిల్లాలి లక్షణం."

పతిప్రాణ సదృశ బంధువు. పతిదైవంబేడు గడయు (పారి 1-96) అని పతిదేవునియొక్క విధి. ఇల్లాలు తన భర్తకు ఎల్లపుడూ కార్యేషు దాసీ కరణేషు మంత్రిగా ఆరువిధాల మెలగవలె. ఆమె భర్త ఎపుడుగూడ తనభార్యకు తల్లిదండ్రి, గురువు, దైవం, దాత, పతి, విద్య అనే సప్త విధ రక్షకుడై ఉండవలె. అపుడు వారి దాంపత్యం ఆయారు ఈఏడు కలిపి 67 వలె అన్యోన్యాభి ముఖమై సాగుతుంది. దంపతులెపుడుగూడ 76 వలె ఎడమొగం పెడమొగం కాగూడదు. ఇది యిందులోని ఉపదేశం. ఇలాచెబుతూపోతే కావ్యమంతా ఉదాహరించ వలసివస్తుంది.

కాలంమార్పుతో సంభవించే సంఘపు మార్పును పాడుకాలమని ఈసడించుకోక తదనుగుణంగా సత్ప్రవర్తనను ఉపదేశించడానికి ఔదార్యాక్రాంత దృష్టులతో పూనుకున్న శ్రీ లింగమూర్తిగారి ధైర్యసాహసాలను ప్రశంసిస్తున్నాను. అధునాతన విషయాన్ని అధునాతన పద్ధతిలో అధునాతనంగా చెప్పిన శ్రీ లింగమూర్తిగారి అభినందిస్తున్నాను. ఈ ఉత్తమ పూర్వకావ్యాన్ని అర్థించే అవకాశం కలిగించినందుకు హృదయపూర్వక ధన్యవాదాలు అర్పిస్తున్నాను.

హైదరాబాద్—380
భవ భాద్రపద పూర్ణిమ
20-9-1994

భాషా సేవకుడు:
తిరుమల రామచంద్రరావు



# విషయ సూచిక

# కుటుంబగీత

## i స్తుతి

1 అణువు నందును మేరువునందు మరియు
చీమయందును మరియును సింహమందు
చీకటిని వెలుగు నందును యేకరీతి
వెలయు చున్నట్టి బ్రహ్మంబు దలతునెపుడు

2 ప్రళయ నిశినుండి మేల్కొల్ప ప్రకృతి కాంత
నేది యెలిగించెనో త్రయీ నాదములుగ
నా ప్రణవ పక్షి వాక్కున కాది కుక్షి
పొదలు గాపుత నాజిహ్వ తుదల నెపుడు

3 అమల పిప్పల వృక్షమునందు నిలిచి
ప్రకృతినిం జూచు చొక్కటి పండ్లనొకటి
తినుచు జతబాయ నట్టి తొల్దినుసులైన
లెంకలన్ గొల్తు చిలుక గోర్వంకలనుచు

4 తల్లి దండ్రి గురువు దైవంబు నలువురు
నాల్గు దశలలోన నరుల గాచు
చుందు రవని గాన ముందుగ వారికి,
వందనంబు సల్ప వలయు నరులు

5 జననిన్ క్లీంకార పదా
త్మను మాణిక్యాంబ నమృత తత్వవిధాయిన్
వినయమున గొలిచి తత్పద
వనజాతంబులకు నెరిగి వారని భక్తిన్

6 వెంకటాచల నాముని విమల గుణుని
సరస సంగీత సాహిత్య పరిచయాత్ము
మానధను సజ్జనోదిత మార్గగాము
జనకు నభినుతి గావింతు సతము మదిని

7 గుణ విశేషుడు గురుభక్తు డనవరతము
ధరణి జీవేశ్వర విశిష్ట తత్వమెరిగి
నట్టి యచలుండు మాతు లుండనఘుడైన
గురుని చేపూరు లక్ష్మయ వరుని గొలుతు

8 పసితనంబున చిలిపిగా పనులలోన
కోడె ప్రాయాన సతులతో కోడిగాన
ప్రొద్దు ప్రాలిన సుజ్ఞాన బోధలోన
తనకు సరిలేని సుందరు దలతు మదిని

9 పెక్కు దైవతముల పేరుపేరున బిల్చి
తలపనేల సకల దైవతముల
స్వస్వరూప మంచు సాయీశునొక్కనే
సంస్మరింతు మదిని సంతతంబు



# ii అవతారిక

1 ప్రోలులకు నెల్ల దేవత ప్రోలకమ్మ
పొలిమెరలకెల్ల దేవత పోలెరమ్మ
ఎల్లలకు నెల్ల దేవత యెల్లమయని
ఖ్యాతిగాంచుచు భువనైక మాతయొప్పు

2 ఆమె వేయి పేరులన నొప్పి యాంధ్రదే
శాన గలవు సంవ సదములెన్నొ
పాడి పంటలకు నివాసంబులై నిత్య
పచ్చ తోరణాల రచ్చ లగుచు

3 పాలమూర్మండలమున నా లీల తోడ
కలువకుర్తి తాలూకాను గలుగు నొక్క
యూరు పోల్కమ పల్లి నాయుజ్వలముగ
నచటి విశ్వ విధాతలు ప్రచుర మతులు

4 అహోభూనన ఋషి గోత్రుడు
మహనీయుడు రామదాస మందిర నాముం
డ హరహ సుమనః ప్రీతుడు
గృహమున భగవంతుడనగ గేస్తొక డొప్పున్

5 భగవంతా చార్యుండని
పొగడొందిన యతడు తనకు ముద్దియగాగన్
భగవతి కామాక్ష్యంశను
వెగడిన కామాక్షి యనెడి నెలత వరించెన్

6 ఆమె కురు మిద్దెయోంకార మయ్య దుహిత
గుణ గణంబుల మహిత నిక్కువపుగరిత
ఇగురముల దొంతి యింటికి తగుపొలంతి
శాలకును కాంతి ముగుదల మేలుబంతి

7 ఆదంపతుల తపఃఫల
మైదనరుననంగ కలిగె నాత్మజుడు ముదా
పాదుడు కృష్ణాచార్యుడు
శ్రీదయితుడు శౌరి యింట చెలగిన మాడ్కిన్

8 తనయుని యభ్యుదయంబును
గననోచని జనకు డేగె కైలాసంబా
జననియె పెంచెను తనయుని
కనుపాపగ జూచు కొనుచు కస్తి మరచుచున్

9 కృష్ణయా చార్యుడదట సహిష్ణు డగుచు
పెరుగుచును బుద్ధిమంతుడై పేరుజెందె
అమర బాదున పేరంది నట్టి పెద్ద
లక్ష్మయాచార్య దుహితను లగ్నమయ్యె

10 తల్లి దండ్రికి రెండవ తనయ యామె
పెరిగె పుట్టింట రత్నమ్మ పేరు తోడ
మెట్టినింటికి రుక్మిణి మెలత యగుచు
కృష్ణునకు నీడు జోడని కీర్తిగాంచె

11 అత్తగారికి వినయాన నణిగి మణిగి
పతికి నేవేళ ప్రియమున బలికి యులికి
అతిథి యభ్యాగతుల నెల్ల నరసి మురిసి
రత్నసాను వనగ గీమురాణ నిల్చె

12 సుతుల ముగ్గురిపై నొక సుతను గనియె
కలిగి సంసారమందు సౌఖ్యమున మనియె
లోక రీతిని వినియె వితాకు నెరుగ
కుండ సంతుష్టి గొనియె తానిందు గాను

13 జ్ఞానమును భక్తి వైరాగ్య మైన యెడద
జీవునకు పూర్వజన్మ విశేషమునను
గాని కలుగవు జగమున కల్లగాదు
జగము వాసన చేతనే జగము సుమ్మి

14 కృష్ణయాచార్యునకు పురాకృత వశమున
పొడమె వైరాగ్య భావంబు బుద్ధి తెలియు
నాటినుండియె తమ యూర పీటవెట్టు
గురువులను శిష్యులను కనుగొనుచునుండ

15 అంత తగినట్టి గురువర్యు సరసి యరసి
శ్వశురు డగు లక్ష్మయాచార్యుడు సకలశాస్త్ర
వేత్త వేదాంత మందున విబుధుడనుచు
నెరిగి తన సంశయంబుల నెరుగ గోరి

16 ఒక్కనా డేకాంతంబున ప్రణమిల్లిమహాత్మాఏను తత్వార్థినై
యున్నానుగాన నాసంశయంబులు నివారించి కరుణించ
వలయునని వేడిన నతండు జామాత మొగంబు పలకించి
యిందుల కొక్క వృత్తాంతంబు గలదు వినుము దాననీ
సంశయంబు లుడుగునని యిట్లనియె.

# iii కథా పీఠం

1 కలదనంత పురంబను గ్రామమందు
నార్యుడొకడు కుటుంబయ్య యనెడు పేర
బాల్యమందుండియె విరాగపరుడయి యుండి
దినమునందొక దేశికుం గని నిర్వృతిని

2 తత్వ విషయం బెఱుంగగా తమరి కడకు
వచ్చినాడను గురు దేవ వలదనకను
గురువవై పరతత్వము గురుతు దెలిపి
బంధ ముక్తుని గావింప వలయు నన్ను

3 అనిన నాచార్యుండతనితో

4 జనులు లోకయాత్ర సాగించు నప్పుడు
దేశకాలములను తెలిసి తనను
తెలిసి బ్రతుక గనిన కలుగునే బంధంబు
భారతీయుడైన వాని కిలను

5 కాపురం బెవండు కడముట్ట చేయునో
వానికేల దగులు వాగురములు
తెలియలేరు నరులు తెలుపున నలుపున
బ్రతుకు సార్థకముగ బ్రతుకలేరు

6 రాజయోగ పథంబున గ్రాలునట్టి
భూజనములకు సంసారమునను కద్దు
ముక్తి యే సాధనము పొంత బోవనేల
నెరుగగా జాల రీకీలు యెడ్డె లగుచు

7 అనిన నతండు రాజయోగంబన నరుండు వివాహితుండై భార్యతో బిడ్డలంగని సంసారంబు జేయుటే గద! సంసారంబు చేతనేగదా జీవునకు బంధంబు దాన ముక్తి యెట్లు సిద్ధించునన నద్దేశికుం డితరాశ్రమంబుల కంటె మానవునకు గృహస్థాశ్రమంబే సులభంబని శౌనకునకు గురువు చెప్పెను గాన

8 రాజయోగ మనంగను ఈ జగాన
ఆలు పిల్లలు సంసార మనుటగాదు
పుట్టినందుకు సంసారమును సలుపుచు
నెటుల జీవించ వలయునో యెరుగుటగును

9 జనము రాజయోగ మనినచో జగమున
నీవు చెప్పినట్లై యెంతురైన
రాజయోగమనగ రాదది సుమి-మోక్ష
మునకు యోగములను ముఖ్యమదియె

10 తనువు చేతను సంసారమును సలుపుచు
మనసు చేతను బ్రహ్మమందున వసింప
వలయు నది రాజయోగంబు వసుధలోన
అట్టివాడు జీవన్ముక్తుడగును సుమ్మి

11 మూఢులు సంసారంబు స్వకామంబునకుగా దలంతురు అది కాలాత్మకుండయిన పురుష స కభిమతంబగు కర్మమయంబైన భగవదాజ్ఞా చక్రంబు ననుసరించుట యని యెరుంగరు-పురుషుల కంగన వలన ధర్మార్థ కామంబులు సిద్ధించు కర్ణధారి నావచేత పయోధి గడచు చందంబున గృహమేధి భార్యచేత వ్యసనార్ణవంబు తరించు, భార్య

పురుషునందర్థంబు భార్యయందు సకల గృహకార్య భారంబునుంజేర్చి పురుషుండు నిశ్చింతుడై సుఖించు చుండు మరియు నితరాశ్రమ దుర్జయంబులైన యింద్రియ శత్రువర్గంబులభార్యాసమేతుండైన గృహస్థుండు దుర్గాధిపతియైన రాజు శత్రుసంఘంబుల జయించు విధంబున లీలామాత్రంబున జయించు నని కశ్యప వచనంబు గావున

12 ఐహికంబున కుడిభుజం బతివ తనకు
అరయనా ముష్మికంబున కన్యభుజము
గాన సతిలేని యిహయాత్ర గడుచు నెట్లు
నొంటి గాడైన బ్రతుకున కొకటి గలదె

13 గృహము పాత్రల సహరహమ్మెటులను పరి
శుభ్రముగ నుంచు నిల్లాలు శోధసమున
అటు పురుష పాత్రలను గూడ నమలినముగ
నుంచగా సతి వలయును యెంచిచూడ

14 కాంతలేకలేదు కర్మాధికారంబు
కాంతలేకలేదు కాపురంబు
కాంతలేకలేదు సంతానభాగ్యంబు
కాంతచూవె సర్వకార్యములకు

15 కావున నీవు తగిన కాంతను వివాహంబుగమ్ము

16 లింగ భేదంబు చేతను రెండుగాను
వేరు పడినట్టి యాత్మల జేరిచిభువి
మరల నొక్కటి జేసెటి మఖము సుమి-వి
వాహమనగను భారతా వనిని నిజము

17. బిగుసుకొని బ్రహ్మచారిగా మిగులుకంటె
తనదు పుణ్యాన నొకకొంత తరుణి కిడుట
పురుషుడగు నాతనికి తనభోగమిడుట
సఖియలకు నొప్పు పెండ్లి యాసమయ మిచట.

18. ఈనేలను పెండ్లిగుసనం
గా నది యుభయులకు చెల్లు కల్యాణముగా
మానవతా పరిపూర్తికి
మానవులొనరించుకున్న మర్యాదసుమీ।

19. నర్మిలికి గూడు సహజీవనంబుగాదు
పతికి సతికిని నది యొడంబడికగాదు
కామ సౌమయికంబది కానెకాదు
ప్రకృతి పురుషులు నొక్కటై బరగుటగును.

20. ఆడు మగరూపముల సందినట్టి జీవు
లేకమై పూర్ణమై పరమైక ధామ
మైన యానంద బ్రహ్మమం దధివసింప
మనువిడిన బ్రహ్మముడి యది బెణకకుండ.

21. ఉవిద పురుషులు గూడియు నొకటిగాక
యొంటరికి పూర్ణతాసిద్ధి యొదవదిచట
వసుధనందుకె ఋషులు సభార్యలగుచు
తపమునల్పిరి యాశ్రమ విపినములను.

22. శ్రౌతకర్మ దృష్టి సంసారదృష్టిని
ఆలుమగలు కలిసి యవనికొకటి
దేవుడైనలేడు దేవిలేకున్నట
పురుషకారమునకు పొలతివలయు.

23\. మానసికముగ మగవాడు - మగువతనువు
తోడ బలహీనులగుటను తోడువలయు
యొకరికొక రెన్నివిద్యల ప్రకటులైన
నదియె హైందవదాంపత్య హృదయముసుమి.

24\. విభుని బ్రతికించుకొనియె సావిత్రి యిచట
రురుడు ప్రాణము పంచిచ్చె తరుణికొరకు
ఒకరులేకున్న బ్రతుకలే రొక్కరిచట
భారతీయుల దాంపత్య మార్గమిద్ది.

25\. కామమును దీర్చుకొనుటకే కాదుకాదు
సంఘమున కీయదగిన సత్సంతతికిని
అతివయేగద కారణ మందువలన
జాయలేకున్న జగమున జరుగునెట్లు.

26\. సద్గుణముగల్గు సంతతి సంఘమునకు
నిడుటకునుమించి జగమున నెవ్వడైన
సంఘసేవ యికేముండు జగతియందు
ఉరకనే బ్రహ్మచారిగా నున్న ఫలమె.

27\. ముప్పదేండ్లను దాటిన యప్పనెత్తి
యమ్మపొత్తి యెడారమౌ నందువలన
నవల సంతాన మగుటన నరిదిగాన
జనులకు సకాలమున పెండ్లిజరుగవలయు.

28\. ప్రాయమునగన్న సంతతే నాయిటందు
వేసినటువంటి పంటయై పెరిగివచ్చు
గాన కనదగు వయసందె గాంచవలయు
సుతులు తతి దప్పికలుగుట సుఖముగాదు.

29. సుతులనే గనందలంచిన నేటికుంతి మంత్రబలంబున కానీనునిం గనవచ్చు. వశిష్టుని మొగమెరుంగకుండ మదయంతి యశ్మకునకు జన్మనీయవచ్చు. దేవకీదేవి గర్భంబు రోహిణీదేవి భరించవచ్చు. లింగనిర్ణయం బొనరించుకొనియే మంగళ బిడ్డను ప్రసవించవచ్చు. నేటి శాస్త్రప్రగతికివి యెల్ల కరతలామలకంబైనను.

30. పతిబడసి సుతుల బడయుట
లతివకు శర్మిష్ఠసరణి యగుటను పతికై
సుతులకునై ధావంతము
మతిలోనను బొందు తీపిమమతలతోడన్.

31. సంతులేనట్టి వారికి స్వర్గసుఖము
నుండదనుటకు మందపాలుండుసాక్షి
సుతుల గనకుండినను పితలధోగతులగుటను
గనె జరత్కారుడిక వేరె యనగనేల.

32. కావున నీవు గృహంబుచేరి యోగ్యంబగు కన్యను వివాహంబాడి పుత్రవంతుండవై దేవర్షి పితౄఋణంబులు దీర్చుకొని కణ్వ మహర్షి శకుంతలను దెలిపినట్లు సంతతిని నీ స్థానంబున నిలిపి యేతెమ్ము పుడు నిన్ననుగ్రహించెదననిపిడ్కొలిపిన నతండిలు సేరి కులీనకన్య నుద్వాహంబై యచిరంబుననే యపత్య వంతుండయ్యెనంత.



# 1. విషాదయోగం

1. ఆకుటుంబయ్య యిల్లాలు అతివమిన్న
పేరు సంతానలక్ష్మి యానారి సుతుల
మిగుల కాంక్షించు పోషించు పగలనెన్న
బోక సంసారమందు నేప్రొద్దుగాని.

2. అతని మిత్రమొక్క డాత్మరామయ్యను
నతడుగలడు వారిహితము నెంచు
అతడు వారియింట సుతుడు మూడవవాడు
కలిగి సంబరంబు గలుగునాడు.

3. కుటుంబరాయనిం గని మిత్రమా! యిక నీవు సంతా
నియంత్రణంబు పాటించుట శ్రేయస్కరంబు. వలస.

4. దనికులందు కుబేర సంతానముండ
పేదకు కుచేల సంతతి పృథివినిండ
కానిపించుచు నుండునీ కారణంబు
ప్రకృతి తత్వంబులోననే బరగుచుండు.

5. ఉష్ణమండల మందున నుండు ప్రజకు
కామమధికంబు శీతల భూములందు
నిగ్రహము మెండు భూగోళ నియమమెరిగి
తిరుగకున్న సమస్యలు తీరవెపుడు.

6. కామపరుడు విలాసి నిగ్రహపరుండు
అగును మేధావి - అతికాము లైనచోట
ప్రజల బలగంబు హెచ్చుట పాటిగాన
నిగ్రహులు గలచోటనే నిలుచుసుఖము.

7. పిల్లలు బెరిగిన యెడలను
యిల్లిరుకట మట్టులుండనీ నీకష్టం
బెల్లను యిమ్మడి ముమ్మడి
మల్లడిగొని యార్జితంబు మరిచాలునొకో.

8. ముచ్చటగచాలు ముగ్గురే ముగ్గురనుచు
యిద్దరేచాలు ముద్దుల గద్దలనుచు
ఒక్కడేచాలు చక్కని చుక్కయనుచు
మారిపోవు నినాదంబు మహిని వినవా.

9 సంతతియెంతో కుంపటి
యంతటి దిగ బెరుగుచుండు నటుగావున నీ
ప్రాంతకుటుంబ నియంత్రణ
చెంతంజని వారిసలహ చేకొన వలయున్.

10 అనియొకనా డతనిం దన
వెనువెంటం గొంచువెళ్ళి వెజ్జు సదనమున్
జని డాక్టరుగని వచ్చిన
పనిదెలిపిన నాతడతని ప్రక్కదిరిగియున్.

11. ఓయీ ! నువు వేసెక్టమి
చేయించుకొనెదొ మరేది చేయదలతువో
రాయిటు చూదువుగాకని
యాయనతో థియేటరునకు నరిగియు నచటన్

12. గోడల వ్రేలెడి పటములు
చేడెలకును పురుషులకును చేసెడు రీతుల్
వాడుకలుం గూడుకలున్
వేడుక అగురొత్తతనకు వివరించి తగన్.

13. జనుని సంతాన తంతులు శస్త్రమునను
కత్తిరించిన సంతతి కలుగదింక
దాని నిచ్చట జేతుముగాన నీకు
వలయునా శస్త్రముంజేయ తెలుపుమయ్య.

14. అనినవిని—తనమనమున నచటనున్న
చకచకల నీను శస్త్రాళి వికలపరుప
హడలి నిలువెల్ల వెల్లనై యచటనిలగ
కాళ్లుచాలక తనమిత్రు కడకునరిగి.

15. మరల వచ్చెదనని చెప్పి మరుగుబెట్టి
బయటబడి మిత్రుతోడను బలికెనిట్లు
చనుచు నాలోచనా పురస్సరముగాగ
మానముడిగిన యట్లయి మ్లానముగను.

16. బాగు మనమిపుడొక పొరపాటుచేత
చేయగలిగితి మిదిపెద్ద చెట్టయగును
త్రెంచవలదోయి సంతాన తంతువనుచు
వేదములు చెప్పుచుండగా వినమె జగతి.

17. సుతులులేనట్టి వారికి గతులులేవు
లేవనుచు శ్రుతితతులెల్ల లెన్ననుడువ
సద్గతికి కారణంబైన సంతతినిల
పడయ కాపుటయనగ పాపమ్మెకాదె.

18. సంతతిం గనుటేగద జన్మఫలము
పుత్రులు జనించుటేగద పుణ్యఫలము
సుకృత ఫలములు లేకున్న సూనులిలను
కలుగుదురె గొడ్డుబోతుల కథలు వినమె

19. దేవపూజా ప్రతిష్ఠలు దినము దినము
వ్రతము లెన్నోనియును జేసి వడయరాని
సంతతి ఫలంబు సుకృత వశాన దక్కు
చుండ వద్దనుకొనుటలు సుజన పథమె

20. దశరథుడును యవనాశ్వుడు
ఉశనుడు మరి యెందరెందరో వసుధేశుల్
కృశియించరె సంతతికిని
రశనులుగా తొల్లితపము లధ్వరములచే.

21 ధర్మమార్గంబు దప్పిన దారిగాన
నీయ సత్కర్మమునకు నేనియ్యకొనను
సంతుపెరిగిన కష్టంబు సంభవింప
నిమ్ము-అది యోర్చుకొనియెద నెంతయైన.

22. పిల్లలెక్కువ యైనచో బిచ్చమెత్తి
యైన సాకగ వలయు వద్దనగ మనము
ఎవరమా దేవుడిచ్చెడు నవన ఫలము
కాలదన్నుట మూర్ఖత గాదె తలప.

23. అవ్వ! సంతాన తంతువు లవనియందు
కత్తిరించిన పురుషుడై కలిగియేల
సిగ్గు! సిగ్గు! యిదేమిటిచేత మిత్ర
యిట్టి నడుమంతరపు పని హేయమగును.

***

# 2. సాంఖ్యయోగం

1. అనిన కుటుంబరాయనింగని యాత్మారామయ్య మిత్రమా!
నీవుచెప్పెడి పురాణ వచనంబు లేనెరుంగని వాడగాను
కాని నీది నేటి దేశకాల పాత్రంబెరుంగని మాట
ఎట్లందువా !

2. 'పుట్టి పెరిగెడివారికి పుడమిలోన
నన్నవస్త్రము గూర్పగా నగునొ లేదొ
చదువు సందెలు నేర్పింప జనునొ లేదొ
నిలుకడగ నీవెయోచించి పలుకుమయ్య.

3. కన్న వారిని పోషింప తెన్ను లేని
తల్లిదండ్రికి క్రొత్తగా పిల్లనికిని
జన్మమిచ్చుట దోషంబు జగతియందు
అగునొ ! కాదొకొ ! యోచించు మయ్యనీవె.

4. నారుపోసిన వాడేమి నీరుబోయ
డాయనుచు వారికర్మకు వారివిడువ
బుద్ధిమంతులు గారేని పుడమియందు
వారిమూలాన నపకీర్తి పాలుగాదె.

5. కనగ కుపుత్రత్వము కం
బెనపుత్రత్వంబుమేలు లేవజెడిన యం
తను మరణం బవమానం
బున కంటెనుమేలు సుమ్మి భూమిందలవన్.

6. పెక్కుసుతులుగల్గ నొక్కడైనను గయం
బెట్టు శ్రాద్ధమనుచు పితలుదలతు
రైన గృహమునిల్ప సాధ్యుడొక్కడుచాలు
పెక్కురేల కుక్కపీకులాట.

7. నరుడెంత నేర్చితిరుగుచు
శరవేగంబునను వృద్ధిసాధించినవే
బెరిగెడి జనులకు వసతులు
సరిపడుటలు లేదుగాదె జగమందిపుడున్.

8. నేటి జననాలరేటు కుందేటిపరుగు
సరుకురేటన తాబేటి చప్పిడి నడ
కనుక కుందేలెచటనేని కునుకకున్న
పందెమెటుగెల్చు తాబేలు పరుగుబెట్టి.

9. పిల్లకాయలు గుమ్మడి పిందెయాట
నాడినటు లింతయంతయై యంతయైన
పంటలకు నేలలేనిచో పౌరులు తమ
తలలు పొలముగ జేసికోగలరె చెపుమ.

10. కూతులెందరు గలిగిన కొడుకులేక
కొడుకు లెందరు బుట్టిన కూతుగనక
సతిపతుల కుండజాలదు స్వాంతతృప్తి
కాని మనచేతి పనియది కాదుగాన.

11. గొడ్డువీగుటె తనయొక్క గొప్పదనము
కూతురు కుమారుడంచును కొసరుకొనక
తనకు దేవుడునిడినసంతతిని బెంచి
సజ్జనుల జేయువాడెపో జనకుడనగ.

12. చిన్నగున్న కుటుంబమే క్షితితలాన
చింతలేనిది సుఖమట సంతసాగు
పరిమిత కుటుంబమే భూమిపైననెపుడు
చూడ ముచ్చటగొల్పును చూపరులకు.

13. కనుటలోగాదు బిడ్డల కనులుగలిగి
పెంచుటందునె గలదుపో పెద్దతనము
అల మదాలసవలె నేటియతివలెపుడు
తనయులను దిద్దదేశంబు ధన్యమగును.

14. అనిన నతండు సంతానంబెటుల బెంచవలయునో యెఱిం
గింపుమని యడుగుటయు.

15. మొదటిబడియిల్లు తలిదండ్రి మొదటిగురువు
లర్భకుల జీవితంబున నందువలన
నిల్లు తలిదండ్రి యాదర్శమెల్లవేళ
బాలునకు గనిపించగా వలయునుమ్మి.

16. ఆలుమగ లత్తకోడండ్రు నలిగిగులిగి
నిత్య పోరాడుకొనునింట నిమ్మళంబు
లేక చీకాకుచేతను లేతయెడద
లెదుగజాలవు తెలివితో పదునుదేరి.

17. మొక్కగా వంగనప్పుడు మ్రోడువారి
వంగజాలవు కొమ్మలు వలసినట్లు
జగతి క్రమశిక్షణము సదాచారసమితి
బాల్యమందుండియె పట్టుబడగవలయు.

18. వేషభాషలు రెండునే వేళనైన
మానవుని రీతినీతులు మహికి దెలుపు
బాలురకు వేషమేగాదు భాషపట్ల
తగిన శ్రద్ధను చూపాలె తల్లిదండ్రి,

19. బూతులను మాటమాటకు నూతగొనుచు
మాటలాడుట కొందరి మంచితనము
ఎపుడు వినుచున్న పసివారి ఎడదలనవి
పట్టిపట్టి ప్రభావిత పరచకున్నె.

20. విరుపులు హేళన లరుపులు
పరుల బనాయించుటలు ప్రభావపరచునా
చిరుతల హృదయము గావున
కరమవి లేకుండ నిల్లుగాచుకొనవలెన్.

21 చాలి చాలని పాండిత్య వాలకములు
తెలిసి తెలియని విజ్ఞాన విలసనములు
అర్భకులముందు వలదు బడాయితనము
వారు పసిగట్టగల రెదురాడకున్న.

22. బాల్యంబున మాండవ్యుండు తూనీగల ముడ్లం గ్రుచ్చి
మునియైన కాలంబున శూలారోపంబు వడసె. ఇక్ష్వాకుండైన
దండుండు తోడి బాలకుల హింసించుచు పురనిష్కాసంబు
బొందె, వేనుండు మాతామహగారాబంబున సాధుహింస
కుండయ్యె గావున.

23. వీధిలో నాటలాడెడు వేళలందు
బాలకులు సాధుప్రాణుల బాధపరచి
సంతసము బొందుచుందురా సరణినొక్క
కంట కనిపెట్టవలెసుమీ గట్టిగాను.

24. పసితనాన నసంగత భయములెపుడు
పిల్లలకు నేర్పరాదవి పెరిగినంత
దయ్యమై భూతమై వారిదగులుచుండు
అసలు దయ్యము నటుబెట్టి కినసరులగుచు.

25. సాధుజీవుల శాపంబు సాయకంబు
మూగజీవుల శాపంబు తేగకత్తి
కాన ప్రాణుల హింసను మానవలయు
ప్రాణిహింస సురాలయ పథము జెరుచు.

26. తనకొడుకు తప్పునెప్పుడు
కనుగప్పగ జూడరాదు కప్పినచోనా
తనయుడు చెడుటకు మార్గము
తనుతానై వేసినట్లు ధారుణిలోనన్.

27. తోటకూరనాడు దొంగతనంబును
దాచిపెట్టిరేని దౌడుగొట్టి
పట్టుబడిననాడు ప్రాణానికేవచ్చు
గానతప్పు లెపుడు కావవలదు.

28. కావున నేటిమానవుం డెట్లుండ వలయునంటేని—

29. ఎప్పుడాడంబరంబుల కేగకుండ
పొదుపరితనంబు నెందును వదలకుండ
నితరులను దేబెరించెడు స్థితికిరాక
ముందుచూపు మనవలె పొతముగాను.

31. వేళదప్పక పనులను విడువకుండ
నల్పుచును క్రమశిక్షణ సడలకుండ
నడుచుకొనునట్టి వానినే పుడమిలోన
లెక్కయగువాడని జనంబు లెక్కగొంద్రు.

32. మాటపై దృష్టియుంచుక మసలుకొనుచు
జిగురు జింజు దలాలియు పొగరుబోతు

గాక స్వార్థిక వ్యవహార కాలమందు
కల్మషములేక మనువాడె ఘనుడనంగ.

33. హక్కులనుభవించు నవసరంబుల యందు
బాధ్యతలను గూడ మరువకుండ
మాతృదేశసంఘ మర్యాదనెపుడు- గా
పాడు చుండవలయు పాడినెరిగి.

34. పృథివి పేరానపరుడని పేరువడక
కాడువడి నిరాశావాది గాకనెప్డు
డాశయము మంచిదైయుండి యరుగువాడు
జన్మచరితార్థముగ జేసికొనగలండు.

36. అనియుపన్యసించిన.

37. ధర్మభయమును నొకవంక కర్మభయము
పాపలభయమ్ము నొకవంక పాపభయము
ఏదిదోచక నెలుగున యెలుగునైతి
నేమిజేయగవలె చెప్పు మిపుడుమిత్ర.



# 3. కర్మయోగం

1. అనినఁనాత్మారామయ్య యిట్లనియె.

2. కన్నలొక్కరో యిద్దరో గలిగినంక
శారదారామకృష్ణుల సరణిగా- ప్ర
భావతి జయప్రకాశుల భంగినాలు
మగలు వర్తించవలె సుమీజగమునందు.

3. ఆదికాలమునుండి యీయలవునందు
మార్గములు రెండుగలవుసుమా జగాన
బ్రహ్మచర్యంబు గర్భనిరాకరణము
వేదములె చెప్పెవానిని విశదముగను.

4. ఋతువుదప్పించి మసలుటో రూడివడిన
మూలికలు వాడుటో లేక ముఖ్యముగను
బ్రహ్మచర్యము బూనుటో సతియు పతియు
ఏదియో యొకటందుకై యెన్నిరవుడు

5. సనకసాదులు మునుబ్రహ్మచర్యపథము
శ్రేష్ఠమని పూనిరైనను సృష్టిదాన
విస్తరిల్లునె యదిగాక వేధకైన
కామనిగ్రహమేవేళ కష్టతరము.

6. కామునింగాల్చివైచినగాని శివుడు
పార్వతిని చెట్టపట్టక మానలేదు
కందమూలాలుదిని మునుల్ కానసున్న
అచ్చరలురాగజూచి తామాగలేదు.

7. ఊర్మ్మలందున నొక్కొపైయున్న కతన
కామసేవన మాహారకరణి నిద్ర
వలెవలయు సర్వజీవులకు జూడ
అది వయోధర్మమద్దాని నాగవశమె.

8. అందరు వివేకానందులగుదురొక్కొ
కామమును బల్మినాపినకాయ హాని
బౌరయుగావున తగురీతి భోగమనభ
వింపవలయును జనులకు పృథివియందు.

9. నరులకును కామశక్తి సంతానశక్తి
వేరువేరగు తృష్ణ శరీరధర్మ
మందుచేతను సంతానమందకుండ
దానినిందీర్చుకొనవచ్చు ధర్మపథమె.

10 నిగ్రహపరుడై నడిచెడు
నగ్రణికి నియంత్రణంబనవసరమె సుమీ
వ్యగ్రుండై ఋతుసమయ స
మగ్రజ్ఞానంబు గలిగి మసలెడునెడలన్.

11. ఏయేకాలము లందున
నేయేదేశంబులందు నెక్కువగుజనం
బాయా దేశములకునిది
పాయని మర్యాద నేటిప్రగతిపథమున్.

12. నరజీవన పరిమాణము
పెరిగెనుగద యందుచేత పిల్లలనిపుడున్
పరిమితముగ గనకుండిన
సరిపడునే నీదుశక్తి సామర్థ్యంబుల్

13. అందువలన నేటియుగద్రష్టలకు
14. పదిసుతులనిచ్చి పడతికి
పదకొండవ వానిజేయు పతినింద్రాయన్
శ్రుతివాక్యము సవరింపగ
క్షితినిపుడవసరముసుమ్మి శీఘ్రముతోడన్.

15. వెనుకట భక్ష్యాభక్ష్యం
బును పేయాపేయ నియమములు దినశుద్ధుల్
మనవారి కుటుంబనియమం
త్రణకున్ సహకారులగుచు ధరపైనెగడెన్.

16. తగదని యిపుడవిమాసెన్
పగటి నిషేకములువచ్చె ప్రణయనిదానాల్
సుగమంబులయ్యె వానికి
తగిన సరంజామవచ్చి తలుపులుదట్టెన్.

17. జంతువులకెల్ల నొకఋతు సమయముండ
మానవుడు సర్వఋతువులు మలచుకొనియె
సంతతింగన నికనెట్లు చాలుధరణి
అందువలన నియంత్రణం బవసరంబు.

18. మునులె గృహస్థులుయేమీ
మనసిజుడేవేళ వారిమీదిగలచెడునో
వనవాసులెకాల్జారగ
వనితల సంగతినిమనెడు వారినడుగుటా!

19. ఎంతఋతుకాల మెరిగిననేమిగాక
నొక్కతీరుగనుండదు యువిదతీరు
వ్యాధిసోక చికిత్సకై యరుగుకంటె
అదియెరాకుండ నడుచుకొంటార్యపథము

20. కామమునకొంత కాలముగడిపినపిదప
తానియంత్రణ మగుటార్ష తాపథమ్ము
లేనిచో నాలుకాన్పుల తానుఖర్చు
లను కృశించుట దప్పదులావుదరిగి.

21. పిల్లలీనాంటెపనులకు చెల్లదని, య
రబ్బ లద్దానిగురిలోన రాయివేయ
కోడెకాడికి రాదని చేరువేయు
గదసుమా రైతు యెరుగవా! గంతనీవు.

22. వెనుకటికిదోషభయమున్
పెనుసిగ్గును బట్టుకొనుట వివరంబులకై
అనువగు రీతులెరుంగరు
అనరాదది నోటనాడు, నాలుమగలకున్.

23. కాలమిప్పుడు మారె భయాలుమాని
చెప్పగావచ్చు నడుగుటచెల్లుగాన
పద్ధతెరిగి నిరోధముపాటిబట్టి
కాన్పులనుకున్న యెడముగాగనగవచ్చు.

24. వలసినచో డాక్టరులను
గలసియడుగవచ్చు నేడుగలరందులకై
నెలవై యూరూరందున
సులువగు సాధనలు మందునూదులతోడన్.



# 4. జ్ఞానయోగం

1. అయిన నే నిపుడేమి జేయవలెనని యడిగిన నతండు
మిత్రమా! ఒక పర్యాయంబు నీవు కనులు దెరిచి
నేటి ప్రపంచంబును గనుము.

2. పరము గోరుచు గాకను భౌతికావ
సరములకు నేడు నరులకు జపతపంబు
లవసరము లేదు శాస్త్రజ్ఞు డన్ని గూర్చె
మిగుల పరిశోధనల్ జేసి మిగుల కుండ.

3. భువినుండి పృథువు వోలెన్
వివిధ పదార్థములు పిండు వెరవు లెరింగెన్
తవిలి భగీరథు నట్టుల
దివి గలయవి భువికి దించె తీవర పడుచున్.

4. రావె రావె యనుచు రాము కాలమునుండి
పిలుచు చందమామ నెలవు జేరె
శాస్త్రవేత్త యింక సంపాతి వోలెను
చూడ నేగ గలడు సూర్యునైన.

5. అణిమాది సిద్ధులున్ మరి
మణి మంత్ర క్రియలనెల్ల మహిపై నిపుడున్
అణు యంత్రంబుల చేతనె
కనిపెట్టెను గద నిజంబు కామితములకై.

6. ఎవరెస్టు నెక్కె మరియును
భువి విడి సూన్యమున నడిచె పురుషోత్తముడై
దివమునె భువికిన్ దించెను
నవనంబులు నల్పలేక శాస్త్ర పరిచితిన్.

7. స్వర్గమున చోటులేని త్రిశంకునకయి
అంతరాళాన ప్రతినాక మపుడు జేయ
ఇప్పటి త్రిశంకులకునయి యిలపయిననె
ఔర! నేటి విశ్వామిత్రుడది సృజించె.

8. కలియుగము నుండియే ముందు గలుగవలయు
కృతయుగము గాన విజ్ఞాన కృషి గనంగ
తమ విజయములె సోపాన తతులు గాగ
బాట వేయుచు నున్నాడు పవలు రేలు.

9. మరణ కారణ వ్యాధుల నరసి యరసి
అంత మొందించి శాస్త్రజ్ఞు డమర మార్గ
ద్వారములు దీయుచున్నాడు ధరణి గాన
ఎరిగి తిరుగగ లేకున్న నెట్లు జగతి.

10. ప్రసవ మరణాలు హెచ్చగు నతివలందు
అగు ప్రమాదాల మరణాలు మగలయందు
ఆత్మ హత్యలు హెచ్చగు నతివలందు
అన్య హత్యలు పురుషులయందు హెచ్చు.

11. పోషించు వాడు చచ్చుట
పోషింపగ వలయు వారు పుట్టుట ధర నీ
వేషంబు కుటుంబములను
వైషమ్యము దెచ్చు చుండు వారక నెపుడున్.

12. జననములకంటె మరణాలు మునుపు హెచ్చు
గాన నానాడు జనవృద్ధి గానబడదు
ఇప్పుడవి తగ్గిపోయె నీ యిలను గాన
సంతు పరిమితి గనకున్న వంత మిగులు.

13. చావు పుట్టుక దేహికి సమము గాన
నవ్వి సమముగ నడిచిన హానిలేదు
భూమి నెపుడైన లేకున్న నామె యెపుడొ
బ్రహ్మనుం జేరి మొరపెట్టు భావి గూర్చి.

14. కానిచో నీగ కరిచిన కపిలవోలె
మేను జడిపించు కాదేని దానితోడి
భూతములు సానుభూతితో పూని సమ్మె
విప్లవించును జనమెల్ల విహ్వలింప.

15. గాలి నిప్పు నీరు కలిగిన నెంతటి
శాస్త్రవేత్తయైన చాలడపుడు
వాని నాపుటకు జగాన గాంచుటలేదె
వరదలును తుఫాన్లు వచ్చినపుడు.

***

# 5. విశ్వరూప సందర్శనయోగం

1. మిత్రమా! ప్రపంచ పటంబున గణాంక వివరంబుల
నొక పర్యాయంబు పరికించిన నేటి విశ్వరూపంబు
నీవే దర్శింపగలవు.

2. ఏడవ వంతగు భూమిది
మూడవ వంతున జనాభ మూగిన దిట భూ
గోళమున నింక గందర
గోళము లేకుండ మనము కోల్కొ_గలమే.

3. సెకనున కొకటిన్నరగా
ప్రకటంబుగ భారతాన ప్రభవింత్రిపుడున్

ఇక నీవె చెప్పు మీ గతి
నెకిలెలు దినదినమున కెన్ని యేర్పడగలవో.

4. నిముషానికి తొంబదిగా
సుమి నేబదినాల్గు నూర్లచొప్పున శిశువుల్
క్రమమొప్ప గంట గంట పు
డమిపైనను పుట్టుచుంద్రు డంగైపోవన్.

5. లక్షా ముప్పదివేలుగ
నీక్షితి దిన దినము బుట్ట నిక నీ లెక్కన్
పక్షానికి నెల కేటికి
వీక్షింపుము చెప్పనేల వృద్ధి య దెంతో.

6. ఏటికేటికి పదునారు కోట్ల పైన
ముప్పది లకారములతోడ మూగుచున్న
ప్రజకు దినదిన మెన్ని పరాయణములు
దీరవలయునో యోచించి తేల్చగలవె.

7. ఈనాటి జగము నందున
చైనా జనసంఖ్య నేడు సగమున్ మీరున్
క్యూనన్ జగమున్ జుట్టున్
దానిం దల దన్నగలము ధరలో మనమున్.

8. దినదినంబిట్లు పెరిగిన మన జనాభ
యనగ నేటికి నీ శతాబ్ద్యంతమునకు
వంటశాల మొదల్కొని యొంటిశాల
వరకు నన్ని సమస్యలే పెరిగిపోవు.

9. మురుగు కాల్వలు మరియును మరుగుదొడ్ల
ప్రక్క నడివీధి ప్రక్కల క్రిక్కిరిసియు

కాపురాల్ జేయువారలు కానబడుదు
రిపుడె పట్నాల నపుడింక నెంచవశమె.

10. పెరుగవు భూములు గీములు
పెరిగెడు జనమేటి కేట పెరిగెడి ప్రజకున్
సరిపడకున్నన్ వసతులు
ధరలో విప్లవము లెట్లు తప్పును చెప్పుమా.

11. వలసమ్మ పరుగువలె మన
వలసిన యవసరములన్ని వడివరుగెత్తన్
అలసట జెందును వానిని
నిలిపి యందుకొనగ నేటి నిపుణుల మేధల్.

12. మనజనాభ యుషాకన్య పఱచినట్లు
పరువులో పఱచుకొన్నచో పంటలెట్లు
వస్తువాహనతతియెట్లు వసతియెట్లు
సరిపడునుసుమ్మి దేశాన కొఱతగాక।

13. పెరిగిన జనమున బాధ్యత
లెరుగక పేచీలుబడుదు రెందులకైనన్
నరహత్యలు మరిఘాతుక
తరచర్యలు ప్రబలె తిండిత్రాగుడుకొరకై.

14. ఆకటికిగాని తిండెల్ల నాహరించి
రోగములుగాని రోగాన వేగుచుండి
కానికామంబు ప్రేరేప కన్నుగనక
వావివరుసలు దలపని వారలయిరి.

15. అర్థంబు లేనిపేరులు
అర్థంబులు లేనితీర్ల నర్థపుచేష్టల్

అర్థము పర్థము లేకను
వ్యర్థంబుగ పెరుగుప్రజల కలవాటయ్యెన్.

16. మూడవ ప్రపంచయుద్ధము
మూడుననెద రర్థశాస్త్రమున పండితులున్
చూడగవలె నపుడింకన్
యేడిండ్లకు నొక్కయిల్లు యేడమిగులునో.

17. రైలులో బస్సులో పార్కులందుసినిమ
హాలు యిస్కోలు నింటరువ్యూలయందు
ఒక్కసీటుకు వందలై త్రొక్కులాట
పుట్లుపుట్లు యిదేమిటి పుటుకనేడు.

18. పంపుదగ్గర జూచిన గుంపుగుంపు
రేసు రేషనుషాపున రేపుమాపు
ఎచ్చటైనను కుచ్చులు కుచ్చులుగను
హెచ్చెప్రజ కాలమహిమదేమొకాని.

19. కలిలో నాకలిదీరక
చెలగిన యీవేనవేల చేతులు కడుపుల్
తలలుంగన్నులు కలిగిన
యిలరూపము నెంచిచూడు మెపుడేనిమదిన్.

20. కలియుగమ్మున నరుని యాకలియుగమ్ము
ఎన్నియున్నను జనులకుతృప్తిలేదు.
ఎంతదిన్నను వారికి హితవులేదు
అడుగులేనట్టి గుమ్మి సుమ్మతనికడుపు.

21 మనుజుడే మృత్యుదేవత మనిషికిపుడు
తనదు యాకలి కొకనికై తహతహపడు

ధర్మదేవత కీనాడు తావులేదు
అల్లుకొనిన జనంబుల యుల్లమందు.

22. విశ్వరూపంబు దాల్చిన విభునినోట
చొచ్చిన కురుబలమ్మటు చూడనేటి
హంతకుక్షి నపూర్వచరాచరంబు
లెన్ని జీర్ణించె నాలెక్క నెన్నవశమె.

23. ప్రాణికోటికి ప్రకృతికి మానవునకు
మానవుని మించుశత్రువీ మహినిలేడు
అతని పెంపికనైనను నాగదేని
మిగులు నతడొక్కడే యిక మేదినిపయి.

24. తాను బ్రతుకవలయు తక్కినజీవుల
బ్రతుక నీయవలయు క్షితిని నరుడు
చెట్టుచేమ మరియు జీవరాశికినెల్ల
చోటు లేక జేయ చొప్పుగాదు.

25. అరువు తెరువెరుంగనటు తరునిర్మూల
నంబుసేయ నేలయగునెడారి
వన్యప్రాణితతుల వధియించ ప్రకృతిని
ప్రాణి సంతులనము పాటిదప్పు.

26. వృక్షసంతతి మేఘాల వృద్ధిపరచి
వర్షకారణమగు చుండు వసుధపైన
పుష్పఫలముల నందించి భూజనంబు
కాయురారోగ్య భాగ్యంబు లందజేయు.

27. వన్యప్రాణులు జగతికి వన్నె దెచ్చు
కాననములకు రక్షణగానెసంగు

జీవశాస్త్రజ్ఞులకు దెల్పు సృష్టి విధము
కాన దన జంతువుల హింస మానవలయు.

28. అతల మంటగ బెజ్జముల్ క్షితికి పొడిచి
తోడి పోసిన భూగర్భ తోయమెల్ల
సమసిపోవు మహావృక్ష సమితియెల్ల
వృక్షములు లేక మేఘ సమృద్ధి లేదు.

29. భారి కర్మాలయంబులు వదలు పొగలు
వ్యర్థమైన పదార్థముల్ వారిదముల
మరి నదీనద జలముల మలిన పర్చె
కావునను వాని హానిని గావవలయు.

30. పంట దిగుబడి కోసమై పాట్లు పడుచు
ఫ్యాక్టరెరువుల నెపుడదే పనిగ జల్ల
చౌడు దేరి పొలమ్ములు సారముడుగు
మందు పంటల మనుజుల మతులు దప్పు.

31. ప్రగతి యెంతయొ దుర్గతి జగతికంటె
నేటి విజ్ఞాన శాస్త్రాన నిజమరసిన
నందుచే దాని వెంబడి నరుగు నపుడు
వెనుదిరిగి చూచుకొనకున్న వెతలు మిగులు.

32. తగని యాంత్రిక వికృతి వాతావరణపు
రక్షయగు నోజో పటలంబు రంధ్రపరచె
నాగరిక జీవనము నేటి నరుని యోజో
శక్తిని హరింపగా జేసె శక్తికొలది.

33. ప్రగతి లోబడి పర్యావరణము పరిస
రములు పట్టించుకొనడేని యమునికొరకు
జనుడు స్వాగత పేర్పాట్లు సల్పినటులె
శాస్త్ర విజ్ఞాన-సాధనా సమితి తోడ.

34. కావున నేటి ప్రగతివాదులిది గమనింప వలయునని
చెప్పిన -



# 6. అక్షర పరబ్రహ్మ యోగం

1. అంత కృష్ణాచార్యుండు మామగారితో మానవులకు
క్రమశిక్షణ బాల్యంబున విద్యాభ్యాస కాలంబు నుండియె
యలవడ వలయును గద.

2. బాల్యమున భావి జీవిత పాద పీఠ
మగును గావున సన్మార్గ నిగమ సమితి
యపుడె నలవాటు గాకున్న నతని బ్రతుకు
అగుడగును గద వ్యవహార జగతియందు.

3. శైశవము నుండియే సదాచార సమితి
జనుని కలవడదేని సంసారమందు
వయసు ముదిరిన వమ్మునే మనసు తనువు
లవి ప్రపంచాన పరుగెత్త నారటపడు

4. బ్రహ్మకాలాన లేవని బాలకులను
బ్రాహ్మి కరుణించజాల దభ్య సనమందు
పొలము దున్ననిగాకను కలము గొనని
గాక తొలి కోడితో మేల్కొ గాంచవలయు.

5. కనుక కుటుంబయ్య తన కుమారులను భావి జీవితం
బున కెటుల శిక్షించె నని యడిగిన.

6. భాష మనుజు జేయగా పశువు నైన
చదువు మనుజు మనీషిగా నంతరించు
ఇంక రచన మహత్వంబు నెన్న తరమె
మృగయు నైనను ఋషి జేయు జగతియందు.

7. శాస్త్రమున బుద్ధి పదునెక్కి జడత బాయు
హృదయ వైశాల్యమబ్బు సాహిత్యమందు
గాన కాంతలు పురుషులేకాలమైన
చదువవలెనవి తమతమ శక్తికొలది.

8. అన్యభాషలెన్ని యభ్యసించినగాని
తల్లిభాషరాని తనువదేల
శాస్త్రచయములెన్ని చదివినగాని, సా
హిత్యమెరుగనట్టి హృదయమేల.

9. పదవిచదువు పెండ్లిచదువును గాకుండ
పదునుగల్గు చదువు చదువవలయు
పడుచు పిల్లవెంట పాలటిక్కులవెంట
చదువు విడిచిపెట్టి జనగరాదు.

10. గుణములకై గాకనుతన
గుణమునకై చదువవలయు కోరికతోడన్
గుణగణములలో నెప్పుడు
గణనకు నెక్కుటయె తనకు గర్వంబుగదా!

11. పత్రికలకును మాత్రమే పరిమితమయి
చదువు సద్గ్రంధ పఠనకు చాలదేని

చదువు గాదదియా పేర సాతెలందు
కాలమును వ్యర్థపుచ్చిన గోలగాని.

12. గురువు తనకంటె నెప్పుడు గొప్పగాన
నుడువజాలని లోపాలు తడవుకంటె
చెప్పినంతగ వినజాలు నెప్పుడైన
అదియె యుత్తమ విద్యార్థి కభ్యుదయము

13. గురువుగారల గుణమెన్న గోరువేళ
అయ్యవారల పనిజేయు నవసరాన
నాస్థలంబున తనతండ్రి యాప్తుడు, సఖు
డుండెనని నిండుమనమున నుండవలయు.

14. గురుకులంబున జదువుచు మురహరుండు
గురునకై యింధనంబులు గొట్టితెచ్చె
గురుని సేవించుటందలి గొప్పదనము
నెరుగజాలుదురే నేటినరులు నిపుడు.

15. ఆడుపిల్లల గనుగొని యల్లరిడక
రాజకీయాల తలదూర్చి రంగుబోక
పలువ పోకిళ్లమరుగుచు విలువజెడక
చదువుకొనువాడె విద్యార్థి జగతియందు.

16. చదువునేర్చిన ప్రతిపని సగముసగము
నేర్చినటుగాన జగమున నేర్వవలయు
చదువవ్రాయను యీడున ముదురులేత
యనకనింతులు పురుషు లంతవని నేడు.

17. మానవులమ వివేకాన మలచునట్టి
విద్యయే విద్యయగుగాని వికృతముగను

నలుపునట్టిది చదువని తలచరాదు
చదువు పేరున సభ్యత వదలరాదు.

18 చదువ నప్పుడు మూఢులు చదివినంత
మూర్ఖుడగు నేటి జనుడన భూమిలోన
పూర్వశాస్త్ర పురాణాలు పొల్లు లనుచు
వాని పరమార్థ మెరుగంగ పాటుబడడు.

19. మానవుని మాధవుని జేయు మార్గమందు
భారతీయుల విద్యలు పయనమైన
జనుల మారణహోమముల్ నలుపునట్టి
దారి నీనాటి శోధనల్ తరలి పోవు.

20. అణువు బ్రద్దలుగొట్టి బ్రహ్మండమునకు
హానిగలిగించు మారణాస్త్రాల విద్య
ప్రకృతి విధ్వంసనమునకు బాటవేయు
శాస్త్రశోధన లెపు డభీష్టములు గావు.



# 7. కర్మసన్న్యాస యోగం

1. పని జేయని నరజాతికి
తినుటకు నధికారమేది తెలియదు గాకన్
తినుటకు మనుటకు సుఖముం
గొనుటకు పనియొకటె వీలు గూర్చును సుమ్మీ.

2. వ్యవసాయమొ యుద్యోగమొ
భువి నేదో యొకటె రెండు బూనగవలద

యవి దుఃఖహేతువగు సుమి
చివరకు నెది తృప్తి గాను జేయరు వారల్.

3. చేత పనిలేక యున్నచో చేతమందు
కలుగుచుండు దురాలోచనలు జగాన
కాన నరులకు నేవేళ నైన గాని
నెద్దియో పని లేకుండ నెసగ రాదు.

4. కాయికంబు నందె గలదు జీవన విధి
కాయికంబు నందె కలదు సుఖము
కాయికంబు నందె కద్దు కైలాసంబు
కాయికంబు లేక గలదె జగతి.

5. నియతమగు పని లేనిచో నిజము గాను
మనుజుడేపని జేయడీ మహితలాన
గాన పనిలేదనెడు వంకకంటె నేదొ
తోచినటువంటి పనిలోన దూరుటొప్పు.

6. క్షణము దినమగు పని లేమిగలిగె నేని
దినము క్షణమగు పని యొండు గనియెనేని
జగమెపుడు కర్మ చేతనే జరుగు గాన
నెవడు పని దొంగయై మనజనదు సుమ్మి.

7. అంద రుద్యోగముం గోర నందు నొక్క
జగతిలో నంత కంటెను స్వయముపాధి
కల్పనము మేలు తన కష్ట కల్పకంబు
యెటుల పూచి ఫలించునో యెవ్వ డెరుగు.

8. అందనటువంటి దానికి నాశపడక
అందినట్టిది యనుకూల మైన రీతి

మలచుకొనుటందె మనుజుని తెలివితేట
లిమిడియుండు మనీషి యియ్యల నతండె.

9. పూవు పుట్టిన వెంటనే తావి యెవని
లో ప్రకృతి యే కళనిమిడ్చె లోకమందు
వృత్తి రూపాన నదె పైకి విస్తరిల్లు
అదియె జీవిక యగుచుండు నంతనంత.

10. వృత్తి చేతను గౌరవ హీనమనుచు
యిప్పు డుద్యోగమే జాతు రెవ్వరైన
గౌరవము వ్యక్తిగతమని కానలేరు
లేరొ యుద్యోగములందు లేకివారు.

11. రైక్వుని యశంబునకు నెట్టి లావు దరిగె
కీడువడెనె ధర్మవ్యాధు కీర్తి జగతి
అల తులాధారునకు యశోహాని యేమి
వృత్తిచే గౌరవమున కాపత్తిలేదు.

12. హస్తమునకు నమాన మగ్గైదు వ్రేళ్ళు
సంఘమున వృత్తు లెల్లను సమమె సుమ్మి
వృత్తి యేదైన నగుగాక వెలితి యేమి
నిర్వహించుటలో నుండు నిండు దనము.

13. ఒక్కజన్మకొకే విద్య యోపినంత
మెరుగుబెట్టగవలె గాని నరుడు పెక్కు
విద్యలను వ్రేలు బెట్టిన వేనియందు
పూర్ణతను బొందజాలడు పుడమి మీద.

14. దాశరధి కెన్ని గుణములు దనరియున్న
ఒక్కబాణ మొకే మాట యుర్వియందు

పేరుదెచ్చెను పెక్కు వ్యాపృతుల వారు
రాము నాదర్శముగ గొన్న సేమమగును.

15. పనికిన్ రెక్కలు దాచుట
పనిదొంగై తిరుగుచుంట పనిగాదెపుడున్
పనిలోనే పరమార్థము
గనె భక్తగణంబు లెల్ల కలియుగ మందున్.

16. అన్ని పనులు నాకె యన్యుల కేలని
పదుగురకు లభించు పనులకెల్ల
తగుదునమ్మ యంచు తాను సర్వారాయు
దగుట తగదు తగదు వెగటు సుమ్మి.

17. కథలు చదివెడు చూచెడు కాలమందు
నెట్లు చిత్తంబు హత్తించు నట్లు జనులు
పనులపై తమ మనసును పాదు గొల్ప
వలయు నిర్లక్ష్యముగ దాని వదలరాదు.

18. కనగా కార్యానందం
బన కావ్యానందమునకు ననుగలము సుమీ
పనిలోబడి నాకలి ద
ప్పిని యెంచని వారి నీవు పృథివిని గనవో.

19. అంగవైకల్య మవకాశ మనుచు నవిటి
వారు భిక్షాన జీవించ తీరు గాదు
ఆత్మ విశ్వాసమును వీడి యరుగనేల
కనరొ తెరకెక్కిన మయూరి కఠిన దీక్ష.

20. సంఘమందునె యీనాడు గలరు శక్తి
సాధ్యమగు నెల్ల కార్యముల్ సంఘమునకు

శ్రమణకులు సంఘమందుకే శరణమనిరి
బుద్ధిజీవుల పథమది పుడమిలోన.

21. జనడు తనసంఘమును జూచుకొననినాడు
సంఘమునకును దూరమై చనిననాడు
శాంతికరువగు నతని సంసారమందు
గాన బ్రతుకగవలయు సంఘముగజనులు.

22. అని బోధించి కుటుంబయ్య తనకుమారునితో నిట్లనియె.

23. జ్ఞానభూమి జగంబున కర్మభూమి
భరతఖండము గావున నరునకిచట
జ్ఞానకర్మము లీరెండు కన్నులగును
ఏది విడువగరాదు నీపాదునందు.

24. జ్ఞానయుక్తంబు గాదేని కర్మనమితి
జన్మముల గల్గజేయును జనులకిలను
జ్ఞానమార్గంబు తొలుతను గాంచవలయు
నపుడుకర్మాను బంధంబులంటబోవు.

25. చదివినందుకు నంధవిశ్వాసముననె
రూఢికితలొగ్గి పనియొక్క రూపుగనక
చేయరాదేది యోచించి చేయవలయు
అదియె సంస్కారమనుచుందు రార్యజనులు.

26. ఒకనికై చేయుపని మరియొకరి కొరకు
నగును ప్రకటనగా గాననందువలన
నెరుగవలయును పనివారలీ రహస్య
మెరిగి తిరిగిన డోకలేదెవరికైన.

27. సిగనుపూవులు తురుమగా చెలువలకును
మొగమునందున కళగల్గు పగిదిజగతి
జనుని వెనుకటి చరితంబు మునుపటికిని
వెలుగులం జిమ్ముసుమ్మి నిచ్చలుఁ గాన.

28. నడువవలె ముందుజూచుచు నడుగువేయ
నుడువవలె వెన్కఁజూచి యెప్పుడునుగాని
జడనువడి దిక్కులంజూడ జనదెపుడును
మానవుం డప్పుడే సుమా! మానవుండు.

29. మనజు డాలోచనమువేళ పైకిజూచు
నెరివిచారంబు గలిగిన నేలజూచు
దిగులు గలిగిన సమయాన దిశలుజూచు
గాని తనతప్పు నెప్పుడు గనగబోడు.

30. పనియొనర్చెడి తరిముందు గనగవలయు
తినెడువేళను గనవలె వెనుకవారి
బాటనడుచుచు గనవలె తోటివారి
తనను తానెల్లవేళను గనగవలెను.

31. రంగమేదైన నగుగాక సాంగునకును
సాధనకు మించి గురువును స్వానుభవము
మించి శాస్త్రములేదు ప్రపంచమందు
కర్మజీవుల కీకలి కాలమందు.

32. ఒకటి యాత్మశక్తి యొకటి యాలోచనా
శక్తి నేడు రెండుశక్తులున్న
జనుడు జూడనేడు శక్తిహీనుడెసుమి
చేత వెన్నయుండి నేతికివలె.

33. కావున నరుండు తనశక్తినెరింగి యాత్మవిశ్వాసమున నడుచు కొనవలయు.

# 8. రాజవిద్యారాజగుహ్యయోగం

1. రాజకీయమందు రంగెరుంగకనేది
శుద్ధసత్వముగను జూపడదిల
ఔర ! గొంతుయొక్క యఘటనా ఘటనంబు
కలియుగంబునందె గాంచవలయు.

2. రాజనంగను ప్రకృతిక రంజకుండు
రాజుద్రోహకగుండు గారాదుసుమ్మి
రాజురాజుగ బ్రతుకక రహిదొలంగు
మారవలెనేడు ఈస్థితి మాటగాదు.

3. న్యాయమార్గంబు గప్పక నడిచెనేని
అవని పాలనకంటె పుణ్యంబులేదు
ధర్మమును లెక్కబెట్టక తరలెనేని
ప్రజల పాలనకంటె పాపంబులేదు

4. పార్టియేదైన ప్రజయొక్క బాగుకొరకె
మతము యేదైన మనుజుల మంచికొరకె
కానియొక్కటి కొక్కటి కలియకుండ
తలపడుచునుండు నెప్పుడు తలలుబగుల.

5. లంచము కంచము మంచము
సంచలనము రేపినేడు సతమతపరుచున్
కొంచెపు గాండ్రైవాటికి
వంచినచో తలను నాత్మవంచనసుమ్మీ.

6. ఎత్తులు జిత్తులు కత్తులు
మెత్తగ పనిచేయు తమను మీరినచోటన్

మొత్తముగా పనిచేయును
ఎత్తరినేగాని దీని నెరిగుండ వలెన్.

7. ధర్మమొకటిదప్ప ధనముచెల్లనిచోటు
నీతిదప్పమతము నిలవదచట
చట్టమొకటిదప్ప చుట్టరికముగాదు
రాజకీయమందు రాజుకైన.

8. హృదయమునకు దప్ప మెదడుకు పనిలేదు
మానవతకుదప్ప మహిమదగదు
పాడిదప్పవ్యక్తి పదవితోపనిగాదు
రాజకీయమందు ఈజగాన.

9. బంధురీతియెపుడు పనికిరాదచ్చట
లంచమన్న దూరముంచవలయు
ప్రక్కదారిబట్టి నిక్కముదాపెట్టు
నక్కబావలెవరు దక్కరచట

10. ఎరుగరానట్టి మోసము లెన్నొజేసి
తెలివిగల తప్పులెన్నొ కుప్పలుగజేసి
నాయకులమని యెన్నికల్ డాయువేళ
బయటబడుచుందు రదితమప్రతిభకాగ.

11. భయముసృష్టించి ప్రజలను భ్రాంతిపరచి
ఎన్నికనుగెల్చి గద్దెపైనెక్కవచ్చు
కాని నిజమైన గెలుపది కాదటంచు
హృదయమేచెప్పు నతనికి పదిబదిగను.

12. కల్లుసారాయి ద్రావించి కన్నుగప్పి
ఓట్లు వేయించుకొనునట్టి నోట్లవారు

నాయకమ్మన్యులేగాని నాయకులుగ
బ్రతుకజాలరు లోకానవాస్తవముగ.

13. రాజకీయంబులోదూరి రంగుమారి
హంగుదారుల చేతిలో నాటబొమ్మ
లగుదురీనాడు గెలిచిన యంతనుండి
ఎంతవారైన నిదినేటి వింతసుమ్మి.

14. ప్రజలసేవకు మరియును పార్టికొరకు
సేవజేయగ నీనాడు చిత్తశుద్ధి
కలుగువారలు కలికాని కైనగాని
కానరారిపుడిదివచ్చి కలియుగమ్ము.

15. ప్రజలకై చిత్తశుద్ధిగా పాటుబడెడు
వాడు తాత్వికుడనదగు వాడుయోగి
వాడుసుమ్మి మహాత్ముడు వాడుబుధుడు
అట్టివానికి యోటేయ దగునుసుమ్మి.



# 9. విభూతియోగం

1. ధనమూలంబు జగంబని
జనులెన్నుదు రందువలన సర్వపథమునన్
మనుజుడు ధనమార్జింపం
గనుయత్నము సల్పవలయు కల్లరిగాకన్.

2. కోరునెవ్వడు విభూతి కువలయాన
దానితేలను ధరించిన మానకుండ

ప్రథిత పంచాక్షరీ మంత్రపఠనచేత
పరమ శివుడిచ్చునైశ్వర్య పటిమతనకు.

3. లచ్చికై దేబెరించుట పిచ్చితనము
శ్రీహరిని నిల్పుకొన్నచో చిత్తమందు
తనను విడనాడియుండదా తల్లియెపుడు
గాన నాదేవితనయిల్లు కదలకుండ.

4. ఇలను సత్కార్యములమాట నెరుగకుండ
కూడబెట్టిన నొకనాడు కొల్లవోవు
పండగకుగాదు దేనికో దండుగలకు
లంచగాండ్రకు దొంగకు వంచకులకు.

5. ధనికులకు చోరులకు పోటిధాత్రిలోన
యిద్ది యేనాటిదో దానినెరుగలేము
హరికి తిరుమంగయాళ్వారు డవతరించె
గాన ధనికులు లోభులై గడుపజనదు.

6. లాకరునబెట్టి కట్టేయ లచ్చినెపుడు
పారిపోవగ వెదకును ప్రక్కదారి
గాన వినియోగపడునట్టి ప్లానుపైన
విడిచిపెట్టిన తనకీర్తి విస్తరించు.

7. తన్రబతుకు మాని మనుమని మనుమనికయి
బ్రతుకుదురు నేడుకొందరు బాబుదొరలు
చేతకాని వారిహమున చేతగాని
వారగుచు పరమున కెంతొదూరమగుచు.

8. దర్శనములెన్ని చదివియు ధరణిలోని
దర్శనములెన్ని జూచియు దండుగయయి

లోభి తనగుణమందే ప్రలోభుడగును
లోభమును వీడశివుడగు లోకమందు.

9. రెండుచేతుల సంపాద నుండెనేని
నాల్గుచేతుల వితరణ గలుగవలయు
అపుడె నరజన్మ సార్థకమగును సుమ్మి
దాచిపెట్టిన తినువాడు వేచియుండు.

10. ఆర్జనకు చేతులేచాలు నంతెగాని
దానమునకన వలయు హృదయముసుమ్మి
ఎన్నిసత్కార్యములు సల్పితనునుగాని
ఎంత సమకూర్చితని యముండేలయడుగు.

11. తనకలిమి బలిమి నదుపున
నునిచిన మనుజుండెపో గుణోదధి యనగన్
ఘనుడనగన్ జనుడనగన్
జనులందున దేవుడనగ జగమందెపుడున్.

12. కాలమని వచ్చుచున్నది గదయనుచును
జనుడు అత్యాశతో చేయిజాచెనేని
నిలువజాలదు అదిఎట్లో తొలగిపోవు
వీచుసుడిగాలిలో గడ్డిపోచయట్లు.

13. సంపాదించుట గాదది
నింపాదిగ ఖర్చుజేయ నేర్చినయపుడే
కుంపటులెరుగవు కొంపలు
సంపదలను నిలుపుకొనుట చావగునుసుమీ.

14. లంచములు పట్టిపట్టియు
సంచితమును జేసిపెట్ట సతమదితను బో

షించదు సరిగద తననుం
గొంచోయెడి నాటికంత కొల్లైపోవున్.

15. లక్షలును కోట్లుగడియించి లాభపరులు
పన్ను లెగవేయ జూతురు ప్రభుతమెరసి
ఆస్తిపన్నును చెల్లింప నవలపించు
కర్మమదియేమొ యదివారి కర్మగాక.

16. పన్ను చెల్లించ కుండిన ప్రజ - ప్రభుత్వ
మెట్లునడుచు ప్రపంచాన నెరుగలేరె
అంబుధి జలంబులీయక నభ్రసమితి
కురియునే వర్షములపెల్లు ధరణిపైన.



# 10. ఆత్మసంయమనయోగం

1. అంత నొకనాడతని గృహంబునకు సంచారవశంబున దేశికుండగు సుజ్ఞానాచార్యుం డరుదెంచి సపర్యలంది అతని సంసారంబునకు సంతసించె,నంత కుటుంబరాయం డప్పుడైన తనకేదైన సాధనామార్గం బుపదేశింపుమని వేడ నతండు సంసారంబున కంటె ముక్తికి శ్రేష్ఠతర సాధనంబు మరొండులేదు గాన నరుండు సంసారంబు నందే యుండవలయునని నిట్లుదెలిపె.

2 ఇలరజోజృంభణము వర్షఋతువునందు
నణగినటు వ్యక్తులందున నడగుచుండు

వికృతులన్నియు సంసార విధమునందు
దారతోనున్న కతమున తప్పకుండ.

3. భారతీయుల జీవన పద్ధతియన
నింటిలోనుండి తపమాచరించు టగును
కానలోనుండు కంటెను కామితముల
నడుమ నిలబడి యుడుగుటే తొడవుసుమ్మి.

4. ఎంత యర్థవంతమౌగాక నాచార
మది సనాతనంబు హైందవంబ
టన్న పండ్లుపులియు నాధునికమ్మున
కది సమంజసంబ నంగ రాదు.

5. వ్యసనముల తెరువుబోవక
పసిబాలునిరీతి హృదయ పద్మంబెపుడున్
మనకెరుగక నిర్మలమై
వసియించుట యొప్పు నిండుభావముతోడన్.

6. సోరతనమున కోరిక లూరి యూరి
అదుపు దప్పి చరించిన నద్దమైన
తిరుగుడెల్లను దిరిగిన నరుకు గొనక
ముడుపు చెల్లింప దప్పదు ముదిమివేళ.

7. అరిషడ్వర్గంబున కామక్రోధంబులు రెండు కడవరకు
విడువకుండు గావున వాని విషయంబున జాగ్రతగా
నుండవలయు.

8. కులకాంతను జేసిన చెలి
నిలు స్వర్గ ద్వారమగుచు నిలువడి నిలుపున్

వెలకాంతను జేసినచో
నిల వరక ద్వారమగుచు నిడుములు గొలుపున్.

9. ఎటులభావించు పరకాంత నెపుడుతాను
అటులె తనముద్దియను పరుంతరయుగాన
నతివ శీలంబుగోరరా దార్యులకును
వంశమునకామె జననిగావలయుగాన.

10. మానముంగోర పురుషుండు వానియొక్క
ప్రాణముంగోరు యువతియీ వరుసెరింగి
నడుచుకొనకున్న నరునకు పుడమిలోన
కలదెభద్రత యేనాటి కైనగాని.

11. క్షణిక కామానికొక కాంతశాశ్వతమగు
జీవితమ్ము కళంకము జేయువాని
తల్లిచెల్లియు సతియెంత తల్లడిల్లు
హృదయమొక్కటి లోకాన మెరుగగల్గు.

12. ఎంతతపముజేసి యిలను విశ్వామిత్ర
ఘనుడు కోపజయము గాంచువరకు
బ్రహ్మఋషియనంగ బడెనెవశిష్టుచే
కోపమునకు మించు కొరివియేది.

13. కాముగెల్వగ వచ్చును పాముదాల్ప
వచ్చునగ్నిని బట్టగా వచ్చుపులిని
బట్టవచ్చు విషమ్ముమింగి బ్రతుకవచ్చు
కోపమును మ్రింగుకొనుటన గొప్పదనము.

14. వైరము కక్షయు హింసయు
దారుణమగు హత్యలకును దారేర్పరచి

ద్ధారుణి కోపముగావున
సూరుల మార్గంబుగాదు సుమికోపమనన్.

15. ఎంతసత్వంబు గలవానినేనిగాని
యరయ బలహీనపరుషంగ వ్యసనములకు
సాటియొక్కటి లేకుండు జగతియందు
గానవ్యసనాల తెరువులు గాంచవలదు.

16. వ్యసనములు గలవారల స్వార్థపరులు
ఏగతిని వాడుకొందురో యెరుగలేము
శుక్రునంతటి వానికే సురనుగలిపి
కచుని బూడిద ద్రాపిరిగద యసురులు.

17. సారసార మెరింగిన సారమతులు
బూందుబూందు మిగుల్చని ద్రాంధిపరులు
బీరువోకుండ త్రాగెదు బీరుబలులు
చోద్యముంగాదు కలియుగ సురలునేడు.

18. ఇల్లు అల్లరిపడుచును గుల్లపాలు
కూడుగుడ్డలులేకాలు గోలపాలు
మేను మతిసుతిజెడి నడివీధిపాలు
తప్పుద్రావెడు వారలగొప్పచాలు.

19 పవలురేయి కష్టపడుచును పనివాడు
కల్లుసార కొట్టులెల్ల సాకు
అలుపిల్లలైన నటుబెట్టి యీనాడు
ఒళ్ళెరుగని శివము నూగియూగి.

20. పొగయుసారయు కల్లాపివు సొగసుకాండ్రు
ఎంతగుల్లగు తమయింటి నెరుగలేరు

జీవితంబున వాని మెచ్చింపుమాన
మేడపై మేడగట్టగలారు నిజము.

21. జనుని మృగతృష్ణ కానందమునకు భువిని
యెన్నిపశు పక్షులును మృగాలెన్నివృక్ష
జాతు లున్మూలమైపోయె సంఖ్యయేది
దీని మానంగవలయును మానవుండు.

22. తనవలెనె భూమిపై ప్రాణితతికినెల్ల
మనెడు హక్కిచ్చె నీశ్వరుడని యెరింగి
విషపు పురుగేనియుంగాక విడువవలయు
కనపడిన చంపజూచుట కరుణగాదు.

23. తానుజీవుడయ్యు తక్కినజీవుల
హింససేయువాని కెటులముక్తి
జీవదయయె జనుని దేవునిగాజేయు
సిద్ధమూలికగును క్షితితలాన.

24. నలునిం ధర్మజునెరుగరా
మరిజూదములాడువారు మాటలుగాకన్
తెలిసియు దెలియని మూర్ఖుల
తరమే దెలుపన్ విధాతతాతకునైనన్.

25. వ్యసనములకును బానిసై వసుధలోన
మెట్టవేదాంతమును వల్లెవేయుచుండ్రు
మనసు నరికట్టజాలని మనుజులెల్ల
రవని నవమార్గమునకు లక్ష్యముగనిలిచి.

26. పరుల మేలోర్వనప్పుడు ప్రాభవంబు
తనకు నిలువగనీయరు దైవతములు

ఎవ్వని యదృష్ట మెట్లుండు నెరుగలేము
పరుల మేలోర్వ గలవాడె పరమశివుడు.

27. అనసూయ కదత్రిమూర్తుల
ఘనతలు తెలవారిపోయె గావునజనుడున్
గన నత్రిమునిగ బ్రతికిన
తననెవ్వరు చెనకలేరు ధారుణిలోనన్.

28. కామలోభాది గుణములు కలిబలగము
గాన కలియుగమందున వానిగెలువ
వీలుగాదటు గావున వేళకొలది
ఎడముగానేగ గావలె నెప్పుడైన.

29. ఎపుడు వ్యాయామ మనుమాట నెరుగకుండ
తనువు నారోగ్యముగ నుంచదలచుటనిన
నన్న మేదియు దినకనే యాకలుడుగ
వలయు నన్నటు లుండునీ వసుధలోన.

30. మొదటి నుండియు వ్యాయామ మునకుజనుడు
పడక విడగానే నలవాటు పడడయేని
అనుభవించును ముదుకయై యట్టిఫలము
తనువు స్వాధీనముంగాక తాతయగుచు.

31. సౌఖ్యసామగ్రి యెంతగా నంతరించ
శాంతి యంతగ దూరమ్ము జరిగిపోవు
వాని నిర్వహణంబును వ్యయముగాంచి
గాన నాడంబరంబుల మానవలయు.

32. నరుని నారాయణునిజేయ భరతభూమి
నివసమును నాకముగదిద్దె యవనపథము

సుఖము కలవాటు బడుటలో సుఖములేదు
మానసిక శాంతిని సుఖంబు మభ్యపెట్టు.

33. నాగరిక భోగములు నేడు మూగిమూగి
మా త్తరల నిద్దురందప్పు మంచి నిద్ర
కరువు జేసెను నరునికి కలిపురుషుని
వలబడని వాడెవో సుఖవంతు డిలను.

34. ఉగ్ర గ్రంథాలు మనిషిలో నిగ్రహంబు
పాడుజేయును యీనాటి పరిమళాలు
సెంట్లు సోపులు పౌడర్లు చెట్ట జేయు
తెలియ రాకుండ లోలోన తొలచి తొలచి.

35. యంత్రముల రణగొణలును తంత్రగాంధ్ర
వెర్రి కేకలు భీకర భేరిపటహ
వాద్యములు చిత్తశాంతిని భంగపరచు
గుండెవేగము బెంచుచు గుబులు రేపి.

36. రంగులెల్లను మనసుపై పొంగు జూపు
పిచ్చిరంగులు కంత్రీలు బెదురు వన్నె
వాసములు శాంతిగోరెడు వారికెపుడు
కోరకుండుట మేలు సంసారమందు.

37. రూపయౌవన మదముల రుజలు నవ్వు
ధనమదము గాంచి ప్రాప్తము గునిసినవ్వు
కులమదము వంశవృక్షము తెలిసినవ్వు
అన్ని మదముల తనకాల మెన్ని నవ్వు.

38. కావున జనుండు

39. ఓగులెరిగియు దిద్దుకొంచోపినంత
హద్దుమీరక మనువాడు అనృతమాడ
కాత్మవిశ్వాసమున నుండి యాత్మసాక్షి
గా చరించెడువాడు నిక్కపు జనుండు.

40. పుట్టినందుకు జగమున వట్టిగాక
మనుచు సత్పౌరుడై వంశమున-కన్న
వారలకు కీర్తిదెచ్చి ప్రాపంచిక సుఖ
మనుభవించియు తుద ముక్తినందవలయు.



# 11. దైవాసుర సంపద్విభాగం

1. శిష్టమార్గమందు చిత్తంబు జేర్చిన
దైవమగును జనుడు ధాత్రిలోన
భ్రష్టమార్గమందు పయనించుచుండిన
వాడె దానవుండు వసుధయందు.

2. దానవులు దేవతలు నొకే తండ్రియొక్క-
తనయులే గద తమతమ గుణముచేత
వేరువేరైరి యీనాటి వారు గూడ
నంతియే మంచిచెడ్డల వంతులోన.

3. బ్రహ్మవంశాన బుట్టిన రావణుండు
అసురుడై పోయె నసురాన్వయమున బుట్టి
భక్తవరుడయ్యె ప్రహ్లాద బాలకుండు
యెరుగవలె దైవ దానవ సరణి యిట్లు.

4. కృతను వేర్వేరు లోకాల త్రేతయందు
నలిమి వేర్వేరు దేశాల ద్వాపరాన
వేరు వీధుల కలివేళ వేరు వేరు
నరులలోన సురాసుర లిరవుకొనిరి.

5. మెదడొకటే పడబెరుగుచు
హృదయము కుంచించుకొనుచు నేగెడు నిపుడుం
గద పిదపకాల మహిమం
బిది మానవు డెన్నొ నేర్చి యెన్నొ మరిచెన్.

6. పెదతల మెదడే గానీ
నడితల మెదడిపుడు జగతి నడచు కొనదు బో
పెదబుద్ధు లిపుడు వొదమెదు
నడుమంత్రపు నాగరికము నరులకు బలుపై.

7. పెదసరపు మాటలాడుచు
తడిగుడ్డల గొంతుగోయు తత్వంబును దుం
దుడుకుగ నాటాడుట లీ
నడతలు గనుపట్టు నేటి నరులందిపుడున్.

8. నేరము కామము స్వేచ్ఛా
చారము రాజ్యంబు నలుపు జనమందిపుడున్
సైరు, షికారులు, క్లబ్బులు,
బారులు వత్తాసు పలుక బారులు దీరున్.

9. మనిషికి మనుజున కంటెను
ఘన శత్రువులేడు నేడు కాలంబేమో
కనువారినెల్ల నిప్పుడు
అనుమానించెడు దినంబు లాసన్నమయెన్

10. అవసరాలకు మితిలేదు అతియె గాని
కావునన్ గడ్డి గరచెడు కాలమాయె
ఏమి చెప్పగ వరుడిపు డేయు వేష
ములను చేసెడి మోసముల్ మునుముబెట్టి.

11. పనికై యొమ్మక దోపిడి
పనికై దిగజారి సాటివారల బ్రతుకుల్
గని దోచుకొనుట తగవే
మనుజుం డిది యెరుగడనుట మాయయెకాదే.

12. తెకతేరగ బ్రతుకుటకై
యొకరొక రొక్కొక్క మోస మొనరింతురు గా
నిక నెట్లు సాగులోకము
సకలంబిపు డిట్లు చెడియె స్వార్థముతోడన్.

13. చట్టంబును పెడమార్గము
బట్టింపగ జూచు నిపుడు ప్రజ్ఞాపరుడే
దిట్ట తన మనుచు రక్షకు
బెట్టిన కంచియనె చేను మేసిన పగిదిన్.

14. పరమ హంసలు గావలె నరులు గాని
పరమ హింసకులైరి యీ ధరను నేడు
యెరుగరే పాపమని హింస యెప్పుడేని
తెలివి ముదిరిన చేష్టల తీరుగాక.

15. పల్లె పల్లె నిపుడు పార్టీలు కలహాలు
కక్ష లెచటి కచట కర్ర పెత్త
నాలు కత్తిపోట్లు – నాలికి యొడి గట్టి
పరువు బాధ్య తెరిగి తిరుగ రెవరు.

16. నల్లధనమును తెల్లగా జేసికొనగ
తెల్లదొరలయి తిరుగుచు నల్లదొరలు
చేయు వ్యాపార రీతులు వేయు నెత్తు
లెన్ని యని చెప్ప నిప్పుడు యెన్ని యెన్ని.

17. తినుటె జీవిత పరమార్థ మనుచు లంచ
ములకు విందుకు తిండికి బూకట జెడి
నోరు తెరచుక తిరిగెడు వారె సుమ్మి
నిక్కమైనట్టి చార్వాకు లక్కజముగ.

18. నీతి నియమాల నెగతాళి పాతబరచి
చట్టముల దిట్టి పోసి లోగుట్టుగాం[ద్రు
పెద్దలన్ లెక్కబెట్టక హద్దువిడిచిన
నాస్తికులు గాని నాస్తికుల్ మస్తునేడు.

19. చీకటి బజారు ధంధాలు చేయువారు
నల్ల డబ్బును పుట్టించి చల్లువారు
కన్నుగానక గర్వాన నున్నవారు
అంధకాసురు లీనాటి అవనియందు.

20. తల్లిదండ్రులు విధి నిషేధాలు విడిచి
కన్నవారలు క్రమ శిక్షణన్న వినక
నున్నవారలు వద్దు వద్దన్న గాని
పుట్టినటువంటి వారలీ పుణ్యజనులు.

21. ఆలకై బ్రాహ్మణులకయి అతివలకయి
ప్రాణముల నిచ్చె నొకనాడు భరతభూమి
ఆల బ్రాహ్మణు లతివల నఘమనకను
కావలయునని చంపేరు ఘనులు నేడు.

22. అగ్నిసాక్షిగ పెండ్లాడి నట్టి సతిని
అగ్ని కర్పించు పతిదేవు నతని నెపుడు
వేపుకొని తిను సతియు నేవేళకైన
ననుభవించక పోరు నా ఘనవిభవము.

23. అతివ బొమ్మనమ్ము మతిమంతు డొక్కడు
ఆమె శీలమమ్ము కాముడొకడు
అతివ నమ్మనట్టి కితవుండు నొక్కండు
అతివ నరయలేని దధమ ప్రగతి.

24. జగతి నస్త్రీల రచనలు నలుపు నట్టి
కవులునుం జిత్రకారులు కథకులెల్ల
సతుల శీలమ్ము నమ్ముక బ్రతుకునట్టి
వారు తరమును చెడగొట్టు వారు జగతి.

25. దొంగ వ్యాపారములు జేసి దొరలగుచును
జీవితమ్మును సాగించు ఠీవివారు
ఎపుడొ తత్ఫలితము చవి నెరుగకుండ
చనగ జాలరు - ఇది ప్రపంచమ్ము సుమ్మి.

26. పుడమి కనుగప్పి యెంతటి మోసమైన
సలిపి నిర్భయముగ నేడు సాగవచ్చు
నైన యొక్కటి గుర్తించు కొనగవలయు
సర్వసాక్షికి కనుగప్పి చనగ వశమె.



# 12. భక్తియోగం

1. మానవులు మాతాపితరులయెడ మాతృదేశంబునెడ
దైవంబు [illegible]ల్లకాలంబు భక్తిగలిగి యుండవలయు
పురుషులకు పితృసేవ స్త్రీలకు పతిసేవవలన బ్రాపింప
రాని యర్థంబులు లేవని మహాభారతంబందలి బ్రాహ్మణ
పత్ని ధర్మవ్యాధుల వృత్తాంతంబులు దెలుపుగాన.

2. ఆలుమగలొక్కటైనంత యవలనేడు
తల్లిదండ్రిని దలపని తనయులుండ్రు
ధర్మపరుడైన వ్యాధు నాదర్శముగను
నుంచుకొని మాతపితల సేవించవలయు.

3. బాలారిష్టంబుల తన
నేలాగున బ్రోచినారో వృద్ధారిష్టా
నాలాగున తలిదండ్రిని
చాలగ రక్షించువాడె సజ్జనుడుసుమీ !

4. తాము విజ్ఞానవంతులై తల్లిదండ్రి
నెద్దుమొద్దని యెంచెద రెడ్డలగుచు
తనకు నామొద్దుబీజమే తనువునిచ్చె
ననుచు నెరుగని విజ్ఞాని ఘనతయేల.

5. తానుపెద్దయి కసరేరు తల్లిదండ్రి
నింటబయటను తగదెట్టి దంటకైన
తల్లిదండ్రిని గాదన్న తనయుడైన
నాత్మ గౌరవహాని సుమ్మవనిలోన.

6. తండ్రియాజ్ఞను నిసుమంత దాటనట్టి
రాముడును బుట్టినట్టియీ భూమిలోనె
తల్లిదండ్రుల సాధించు తనయులిపుడు
క్లొల్లలైపోయి రౌరార కుతలమహిమ.

7. మాతృదేశఋణము మనుజులందరిపైన
నుండుతప్పకుండ నొక్కతీరు
తల్లిదేశఋణము తరిగల్గినప్పుడు
తీర్చలేనివాని తెలివియేల.

8 తల్లినేలకు ప్రాణాలు ధారవోయు
త్యాగధను లుదయించిన ధరణినేడు
దేశసంపద పరులకు తెక్కలులయి
అమ్ముకొను స్వార్థపరు లుదయమ్మునైరి.

9. దేశము నాకేమిడెనని
ద్వేషించుటకంటె నేను దేశంబునకై
నాశక్తినేమి నిడితని
చూసికొనందగు జనుండు సుఖపడగోరస్.

10. ఇక దైవవిషయంబు వినుము—

11. పార్వతీ పరమేశ్వరుల్ ప్రకృతిపురుషు
లాది ముండవ్వ యెవరైన నేమిగాక
వేరువేరని దైవంబు తీరుగనక
తన్నుకొను చుంద్రు జగతి మతాలవారు.

12. కాయమునకుగాక కాయంబుతోనున్న
నీకురూపుగలదె నిక్కముగను
దేవుడైననంతె తెలియుమీ తత్వంబు
సృష్టికొరకు దేహయష్టి దాల్చె.

13. ఇలనిరాకార సాకార ములనునేదో
యొక్కటేగొని దూషింప తక్కుదాని
బొమ్మబొరుసుల లోనొండు బొలుచునట్టి
నాణెమునుమార్చ జూచుటే నరుడు జగతి.

14 హైందవులది విభూతియోగాశ్రయంబు
అక్షర పరబ్రహ్మ మితరుల దగుజగాన
గీత నరులందరిది యొకేరీతిగాని
ఈశ్వర విషయమున భేదమిటులజెలగు.

15. ఈశుడన్న నేమి యేసనగానేమి
రాముడన రహీము నామమన్న
పలుకు భేదమంతె పరమార్థమందున
తత్వ భేదమున్నె తరచిచూడ.

16. చదివి నతనికంటె సామాన్యుడేమేలు
దైవతత్వమెరుగు ధరనతండు
శివుడు కేశవుండు చిన్నమ్మ పెద్దమ్మ
యనుచుభేదబుద్ధి గొనడతండు.

17. మగలకు సంధ్యోపాసన
మగువలకును నోమువ్రతము మార్గముగాసీ
జగతిని ఋషులేర్పరచిరి
సుగతికినవి సల్పవలయు సుమ్మివిడువకన్.

18. పలుయవసరముల బట్టియు
పలువురతో పరిచయమ్ము పలుదేవతలన్
గొలుచుట తప్పదు జగమున
నిలుదేనికి గీమునందు నిలిచిన వరకున్.

19. పంచాయతనారాధన
మంచితముగ పంచయజ్ఞ యజనము మరియున్
పంచోపనిషత్పఠనము
పంచీకరణోపలబ్ధి భావింపవలెన్.

20. విభుండప్రత్యక్షంబు విభవంబులు విభూతులు ప్రత్యక్షంబు హరుండ ప్రత్యక్షంబు గురుండు ప్రత్యక్షంబు భగవంతుండప్రత్యక్షంబు భక్తుండు ప్రత్యక్షంబు ప్రత్యక్షంబూతగాని యప్రత్యక్షంబున కేగుట భారతీయుల కర్మరహస్యంబు గావున సాకారారాధనం బప్రయోజకంబుగాదు.

21. హవ్యమును మాత్రమేగాని యన్యులిచ్చు
యర్చనలు గొనకుండునే యభవుడజుడు
ఎటులవీలున్న నటుల సేవించవచ్చు
భక్తియొక్కటి ముఖ్యమై బరగుచుండు.

22. దేవఋషి పితృఋణములు
శ్రీవిధితో దీర్చవలయు క్షితినెప్పుడు న
వ్వేవిధిని మానదగనివి
నీవు తరించుటకుజగతి నిశ్శ్రేణియగున్.

23. ఎంతవర కింద్రియ జృంభణంబడంగకుండు నంత వరకు హృదయ పరిపక్వంబు గాకుండు. ఎంత వరకు హృదయంబు స్థిరంబు గాకుండు నంతవరకు జ్ఞానగ్రంథి వికసింపనోప దెంతవరకు జ్ఞానవికాసంబు గాదో యంతవరకద్వైతానుభవంబు గలుగజాలదు గావున సంసారి యద్వైతానుభవంబు స్థిరంబగువరకు

శ్రౌతస్మార్త కర్మానుష్ఠానంబు నిర్లక్ష్యంబు జేయం జనదు. వ్యక్తులకు భావాద్వైతంబెగాని క్రియాద్వైత ద్రవ్యాద్వైతంబు పనికిరాదని తెలిపి దేశికవరుండరిగె.



# 13. క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగం

1. అప్పుడొకనాడు సంతానలక్ష్మి యెదిగివచ్చుచున్న తన కూతుంబిలిచి సమీపంబున గూర్చుండ బెట్టుకుని యిటుల బోధించె—

2. తిలకము చీరెయు స్వర్ణా
భరణము లందుండునట్టి బాగును పాశ్చా
త్యులెమోజు పడుచునుండగ
కరమవి మోటయ్యె భరతకాంతకు నిపుడున్.

3. తమవేషమె తమశత్రువు
తమ స్వేచ్ఛాగతులె యాకతాయిగబొంచున్
రమణులిది యెరిగి తిరిగెడు
సమయము నాగరికతనుచు సంబరపడకన్.

4, ఇంతియబలని యార్యులు నింటివరకె
పరిమితముసేయ నీనాటి ప్రగతిపేర
మగల సరియని నిలుదాటి వగలుతమకు
తామె కొనితెచ్చుకొనినార లేమనంగ.

5. పడమటి దేశంబులలో
పడతికి నేమంబులేదు పతివిడిచి పతిన్

వడయుదు రెందరినైనా
నడతలు సరిగావు భరతనారికి నెపుడున్.

6. ఒకనికి నంకిత మగుచున్
అకలంక త్యాగభావ నా నిరతిని వే
రొక చింతలేక మనుటయె
ప్రకటమతము భారతీయ పడతికి నెపుడున్.

7. వసితనానలేవు వసివాడిననులేవు
ఆడమగలతెల్వి లవనియందు
నడుమకొంతసేపు నాటకమాడించు
తెలిసి తిరుగవలయు నలుగకుండ.

8. పరపురుషులతో చనువుగ
మెలగుట సరిగాదు నేటి మెలతకు నెపుడున్
చెలుడగునో విలనగునో
బెడిసినచో చేయిచేయి పిసుకు కొనుటగున్.

9. ప్రేమకెంతటి వీరుడో పెండ్లికంత
పిరికిబారును నీనాటి పిల్లకాయ
గాన కన్యకలెంతటి ఘనునిబిడ్డ
లైనయెదవిప్పి తిరుగుట యదునుగాదు.

10. అందకందకుండ నాడుచున్నంతకే
అందగాడుసుమ్మి ఆడుకూతు
రందెనేనియంద మడుగంటియాతడు
క్రొత్తరుచులు గోరకున్నె మరల.

11. కక్కువచ్చినపుడు కళ్యాణమునువచ్చి
నప్పుడాగవైన యతివకివ్వ

దేదిముందు వచ్చునెరుగుట కష్టంబు
ప్రొద్దుపడమరగను బొడుచుచుండు.

12. పురుషునకునేది రసికతా బిరుదమిచ్చు
పొలతికదియే మొ రంకయిపొగలులేపు
స్త్రీపురుషు లిద్దరికి రంకు చెరినగంబు
కాని దోషంబు గట్టేరు కాంతతలనె.

13. ఎవనిమనసిచ్చి ప్రేమించు నెపుడుతాను
వాడెహింసించు నెవనికి ప్రభవమిచ్చు
వాడె పెరిగి నిరాదర పరచుచుండు
పడతిజీవిత మిది యీప్రపంచమందు.

14. తరుణులిప్పుడు స్వయంవర తత్పరలయి
తల్లిదండ్రిని గాదని తమకుతామె
పెండ్లికై సిద్ధపడుదురు ప్రేమపేర
కావు కామవివాహముల్ గౌరవములు.

15. కన్నవారికి తలవంపు గలుగజేసి
ప్రేమికుని తోడలేచెడి లేమయెపుడొ
యనుభవించును తన యవినయ ఫలంబు
గాన పెద్దలసాక్షిగా గమ్మపెండ్లి.

16. కూడు ముప్పదిజుట్టులు కూర్మితోడ
మూడుసిగలొక్క చోటను కూడవనెడు
మాటయిప్పుడు నిజమైన మగువలెల్ల
రెంత పెద్దగజదివిన నేమిఫలము.

17. ఇద్దరతివలెప్పు డిరుకున బడకుండ
మసలగల విశాలమైన యిల్లు

ఈ ప్రపంచమందు నెక్కడలేదంట
గానఓర్పునేర్పు గరవవలయు.

18. వంటచేయగ రాకున్న వనితయేల
ఇంగితమునేర లేకున్న నింతియేల
పతినియలరింప జాలని పడతియేల
మెచ్చరే దేశమందైన మేటిమగలు.

19. కాపురానకు నిగురంబు గరవకున్న
తన్విజన్మంబు వ్యర్థంబు ధాత్రిలోన
తానుసుఖపడ జాలదు దయితునైన
తనివిజెందింప జాలదు పనులచేత.

20. వస్తుసంపాదనము మగవానివంతు
వానిరక్షించి పొదుపుగా వాడుకొనుట
వనిత వంతటుగాకున్న వల్లభుండు
ఎంతయార్జించి ననుగాని యేటిపాలు.

21. ఇంటిపని కోపకను దానివెంటబడిన
తనదు నానంద మారోగ్య మనుభవింప
జాలకను కూలినిచ్చి యాచానకిడు పె
యగును నిల్లాలికెప్పుడే యగునుగాక.

22. చీటిమాటికి పుట్టిల్లు జేరుటనిన
తల్లిగారింట తరచుగా తడయుటనిన
చెలుని తననుండి దూరముజేసికొనుట
అన్యకాంతకు నర్పించు టగును పతిని.

23. తనయలంకార మారోగ్యమునకు తగిన
శ్రద్ధ జూపని తరుణియే సమయమైన

తనుతానుగ పతికిని దవ్వుజేసి
కొనుటయగు సుమి తుదినాల్కొ కోరుకుకొనగ.

24. వ్యసనపరుడైన పురుషుండు వసుధలోన
ఫలితమిల్లాలి పాలిట బడునుగాన
వనితలెప్పుడు భర్తల వ్యసనములను
కంటగనిపెట్టి మరలింప గడగవలయు.

25. అత్తమామల తలిదండ్రి యనిదలంచు
కోడలికి నింటనెప్పుడు కొదువగాదు
అట్లుగాదేని యాయిల్లు నారడులకు
నిలయమై యింటివారెల్ల నలుగుచుండ్రు.

26. అత్తమామల తానెట్టు లరసికొనునో
యామె తలిదండ్రి నట్టులే యరయగలరు
వదిసగారలు కావున నిదియెరింగి
మసలవలె గోడలత్తింట మనసుబెట్టి.

27. ఇంటికోడలి సుఖదుఃఖ మెంచకుండ
నత్తయింటున్న బిడ్డకై యగలుచుండు
నింటియావిడ యిదివింత కెల్లవెంత
ఆడుపుట్టువు సమమెకా యందరికిని.

28. పెత్తనమునకు నారట మత్తగారు
హక్కుకోసము కోడలు వెక్కసంబు
మానుకొనకున్న నాయింట మగలబ్రతుకు
అగును నడకొత్తులో పోకయావటంబు.

29. అత్తగారు బహిర్లాపి యామెకు దగ
కోడలంతర్లాపిగా గూడెనేని

చెప్పగారాదు నాయింటి గొప్పదనము
పలుసమస్యల వలయమై పలుకబారు.

30 అని తెలిపి యనంతరంబామె కుమారుని బిలుచుకొని.

31. కొడుకునకు కట్నమీవలె కోరినంత
అల్లుడుంగారు రావలె నగ్గువగను
ఇట్టి గొంతెమ్మ కోరిక లింట నింట
కానిపించును పెండ్లి బేరాన నేడు.

32. ధనమున కులమున పదపిని
తనకంటెను గొప్పదైన తరుణిని గోరం
జన దెప్పుడు పురుషులకున్
వనిత తనంతటను తాను వలచిననైనన్.

33. డాబు నేపు రూపు దబ్బును దర్పంబు
జూచి భార్య నెన్న జూడరాదు
దయిత యనగ జీవితాన భాగస్వామి
గాన తనకు దగిన కాంతవలయు.

34. ఉత్తమ మనువునకు సుశర్మ నతికి సౌశీల్యంబు దప్ప
సౌందర్యంబు ప్రధానంబు గాదని తెలిపె గావున -

35. పండుపై రూపముంగని భ్రమసి కొనిన
రుచిగ లేకున్న తినువేళ రోయుజనుడు
కన్యకయు నంతె రూపమో కట్నమొగని
కోర సంసార గుణము లేకున్న నెట్లు.

36. ప్రేమ గల్గిన చోటనే పెండ్లి యగుట
జరుగునో లేదొ వలపులు జగతి నెచట

పారవైచుకొనక తాను పరువు గలిగి
నుండవలయును జగతిలో యువకు లెపుడు.

37. మేనరికమని చుట్టరికాన బోక
కట్నముల కానుకలమీద కన్ను లిడక
చదువు సంస్కారములు గల స్థలము జూచి
తనకు తగువారితో పెండ్లి తలపవలయు.

38. పుస్తె కూటంబు కాదోయి వసుకూట
యోనికూటము గాదోయి జ్ఞానకూట
ములను గనవలె పెండ్లి కిప్పుడు జగాన
లేనిచో కాపురంబులు నెగులలేవు.

39. రజ్జుకూటము గాకను రక్తకూట
ములను జూడంగవలె నేడు ముఖ్యముగను
కానియెడ గల్గు సంతాన కందళముల
కాయురారోగ్య భాగ్యము లందవుసుమి.

40. ధనమే జగతి ప్రధానం
బనబోకా రోగ్య సౌఖ్యమానందంబుల్
కొనలేకుండిన నయ్యది
మనుజున కిక నేల ప్రేతమంగళమె గదా!

41. అనురాగం బానందము
కొనగలమా ధనముచేత కొంటిమి గాకన్
అనవచ్చునె యవి నిజమని
తనకెసరుం బెట్టుకొనుట తానది తలపన్.

42. ఎంతపెద్దగ జదివివ నంత పెద్ద
కట్న మడుగును మగవాడు కర్మమేమొ

ఆడు సొమ్మున బ్రతికెడు నాసగాక
ఆర్షపద్ధతి యదిగాదు అవనియందు.

43. సర్వజిద్యాగ మొకటి సల్పుటొండె
తుది తులాభారమున నిల్లు తూచుటొండె
అగును తలిదండ్రి కిప్పుడు మగువ పెండ్లి
మారవలె నీ స్థితిప్పుడు మన జగాన.

44. వరకట్నంబులు గొనుటయు
మరి కన్యాశుల్క మిడుట మర్యాదగునే
ధరలోన సరిసమానం
బరయగ నాకౌతుకంబుగా నుభయులకున్.

45. చిలుక గోర్వంకవలె జత చేరిపోయి
కాపురము సేయ కట్నమా కారణంబు
ఆశయా లభిరుచులెల్ల నైక్యమగుచు
నొప్పవలెగాక నిద్దర కెప్పుడైన.

46. లగ్నమున నిచ్చు పుచ్చుకొన్ లాంఛనాలు
వలెరువ్వంగ గంధంబు చల్లినట్లు
సాగవలెగాని తుదిబోయి నాగవల్లి
నిష్ఠురాలకు దిగనేమి నిండుదనము.



# 14. విజ్ఞానయోగం

1. ఇక దంపతు లెట్లుండవలె నంటేని తెలిపెద వినుము.
పేదరికంబుండని గాక. వారాట కీయుషస్తుల వలె
నొకరి నొకరు కనిపెట్టుకొని సర్దుకొనిపోవు వారైన నా
నంసారంబు సార్థకంబగు.

2. పొలతి పురుషులు దేహిక బొమ్మబొరుసు
లుర్విలో గాన నొకరులే కొకరి కెపుడు
చెల్లుబడిలేదు సంసార సీమలోన
హెచ్చుకుందాడ వలదు వారిద్దరలను.

3. పురుషులకును శాసించుట
తరుణికి ప్రేమిట స్వతః ప్రకృతి యగున్
సరిసమమై చెరిసగమై
యిరువురి కవి విహితమగుచు నెసగగ వలయున్.

4. డోలు సన్నాయి వోలెను ఆలుమగల
సుతిగలిసెనేని యాయిల్లు చూడవేడ్క
వచ్చుతోరణములు లేక ప్రబలుచుండు
నిత్యకల్యాణ మాయింట సత్యముగను.

5. గంధమును కప్పురంబును గలసినట్లు
పాలునీరేకమైపోయి బరగినట్లు
పారదపు పూదె లొకటిగా జేరినట్లు
లాలుమగ లొక్కటైపోయి యమరవలయు.

6. వలచి వలపించు కొనుచును తొలగకుండ
కలిసిమనసిచ్చి పుచ్చుక కలిమిలేమి

తలచ కభిరుచు లాశయాల్ కలుపుకొనుచు
నౌకరి తప్పులు మన్నించు టొకరికొప్పు.

7. కలిమిలేములు లోకాన కావడులగు
గాన నవి లెక్కసేయగా గాదెపుడును
ఆరుమూడైన మూడారునైనగాని
సతిపతులు ముప్పదారుగా జనదెపుడును.

8. ఆరుకర్మాల కులసతి యమరవలయు
ఏడుగడగాను పతియెప్పు డెనగవలయు
అపుడె డెబ్బదియారుగా కరువదేడు
గాను వారల మనుగడ కళలుదేరు.

9. పసుపుత్రాడామె మెడలోన పలుపుత్రాడు
పోయు తల్త్రాలు తల్వ్రాలు సేయరాదు
భార్యయనగుదిబండగా బరువగుచును
అతనినలయింప జేయరా దతివకెపుడు.

10. ఇల్లుసరిదిద్ది కాపాడు చెపుడుపతికి
మనసెరిగి సేవజేయుట మగువవంతు
ఆమెకోరిక లభిరుచు లరసికొనుచు
అదునెరిగమెచ్చి లాలించు టతనివంతు.

11. విభుని కనుసన్నలందున మెలపుకొనెడి
తమ్మికంటిదె సౌభాగ్య మిమ్మహిగన
చెలిని తననాల్కలోపల నిలుపుకొనిన
మగడె సత్యమ్ముగా చతురుడగును భువిని.

12. ఆలుమగలు పరస్పరమణగి మణగి
యుండవలె నంతమాత్రాన నౌకరికొకరు

బానిసలుగారు దాసులుకానెకారు
ప్రేమదాసులు వారునా భూమికలను.

13. అరయ ప్రాపంచికంబున నతనికినతి
పడకటింటికి జేరిన పడతికిపతి
యణగియుండిన ననురాగ మనలుదొడుగు
నిత్యనూతన మగుచుండి నిజముగాను.

14. పుడమి నాత్మసమర్పణ బుద్ధిచేత
ఆలుమగలొండొరులు మనినపుడెజగతి
యగును సంసార మటుగాని యంతజూడ
సాగరంబగు వారిసంసారమనగ

15. కాంతుడును కాంతయొకరికి గాకబంధ
మిలను సంసారజలధి తరించుటకయి
తెప్పలై యుండవలె నదే గొప్పదనము
అపుడెవారి వివాహంబు హర్షమిడును.

16. భార్య తనమాటవినదని శౌర్యపడక
నామెకును హృదయంబుండు నంచెరింగి
మనసెరిగి సర్దుకొనిపోవ మంచిదగును
ఆలుమగలను మాటకు నర్థమదియె.

17. మాటయొక్కటి మరియును మనసొకటిగ
నాత్మయొక్కటి యగుటపో నాలుమగలు
అంతెగాకను నిరువురే చింతలేక
బ్రతుకుటనగ నదృష్టంబు క్షితినిసుమ్మి.

18. ఉత్తమ సంతానంబుగోరు దంపతులెట్లుండ వలయు ననిన.

19. కోడె ప్రాయాన వెలిరుచుల్ గోరితిరుగ
మేలిమగు వీర్యశక్తులు గాలిపాలు
తాలుతోడెంగ తమయింట మూలనిండు
మేన సౌఖ్యామయంబులు మెట్టవేయు.

20. కలిని యక్రమసంబంధ కామమునకు
నెప్పుడెటుల ఖరీదు చెల్లింపవలసి
వచ్చునో యెవ్వడెరుగు దేవతలకైన
తప్పలేదదిగాన నాతప్పవలదు.

21 కామము నెవరుపవిత్ర
గా మరి యాహ్లాదకరముగా గడుపుకొనన్
యేమరుదురో వారిండ్లను
తామసగణముద్భవిల్లు తనయులుగాగన్.

22. ఏదిబడిననదియె యెప్పుడు తినువారి
కెటులబడిన నటుల నిలను దిరుగు
సంతుగలుగు సుమ్మి జగతిలో నాహార
శుద్ధివలయు మంచి సుతులకొరకు.

23. కనగా శుద్ధోదనులకె
జనియింతురు బుద్ధులనుచు చరితలు చెప్పన్
కనుగొని ఈమర్మముజన
ము శుద్ధాహారపరత బూనగవలయున్.

24. కనసదాచారమునులేక గనినసంతు
పోజులేనట్టి పోటోల చందమగును
గాన సత్సంతతినిగోర కలియుగాన
సతిపతులు శీలవంతులై బ్రతుకవలయు.

25. విధినిషేధము లెంచక విభుని దరిసి
కన్నవారు హిరణ్యాక్షకశిపులైరి
నియమనిష్ఠల చేగన్న నిసువులేమొ
యమరులైరి మరుద్గణ మనగజగతి.

26. దనుజసతి నారదుని గానమును వినివిని
కనియె ప్రహ్లాద భక్తుని - గనెసుభద్ర
విభునిచే యుద్ధకథవిని వీరసుతుని
తల్లిశీలము ధరనిట్లు తనయుదీర్చు.

27. ముగ్ధమాధుర్య సౌందర్యముల నెసంగు
రూపభావనచేత నిరూఢులగుచు
చొక్కు సతిపతులకుగల్గు సుతులెపుడు - న
ప్రతిములై యొప్పుచుందురు ప్రతిమలవలె.

28. తాముదాత్తభావ తతిప్రేరితులునైన
కలుగువారలట్లె కాగలారు
గాన బుద్ధుడేసు నానకు సోక్రటీస్
సూక్తులెపుడు వినుట సుదతికొప్పు.

29. గొడ్డుబోతుదనము కుంభినిసమమగు
సతికిపతికిగూడ సుతులుకలుగ
రేనివైద్యుగాన నేగుటేలెన్నగు
నెదిరిచూచుటకంటె నెప్పుడేని.

30. అధికసంతానమున కాయమడలునట్లు
గొడ్డుదనమునసెద క్షోభగొనునుగాన
దంపతులు తగువేళ సంతానవరులు
గావలయుసుమ్మి సంసారకారణమదె.

31. సతిపతులు దోషయుతులైన సమయమిపుడు
మారె పూర్వయుగంబుల తీరుగాదు
వచ్చిరి పరీక్షనాళికా పాపలిపుడు
ద్రోణులును కుంభజులునేడు దొరుకగలరు.

32. సంతుగలుగని సతులది సగముతప్పు
ఆడుపిల్లలె గలిగిన యతనితప్పు
కొడుకె కావలెననుకొంట కొంతతప్పు
అధికసంతాన ముభయుల దగునుతప్పు.

33. అపుత్రస్య గతిర్నాస్తియను మనువచనంబు స్త్రీపురుషులుభయులకు సమానంబుగావర్తించు పురుషసంపర్కంబులేక స్త్రీలకు సంతానప్రాప్తిలేదు. సతిలేక పురుషుల కపత్యలాభంబులేదు గాన సంతానార్థ మాయిరువురు పాణిగ్రహణ సంస్కారంబున నేకంబై సంతతియిడు తర్పణంబులకై పిప్పలఫలంబులకై నిరీక్షించు తిత్తిరిపక్షులవలె నిరీక్షించు పితరుల దనుపవలయు.

34. జన్మచే లోపమున్నచో సతిపతులకు
వగవపనిలేదు సంతృప్తి మిగులుకొరకు
గాని యనాధాశ్రమంబున కుర్రనొకని
పెంచి బుద్ధులుజెప్పింప పేరువచ్చు.

35. మేనకతనూజ యెంతటి మేలతయయ్యె
కుంతివదలిన రాధేయు డెంతయయ్యె
ఏగనిని బుట్టురత్నమ దెంతవిలువో
సానబట్టిననేగదా జగతియెరుగు.



# 15. శ్రద్ధాత్రయవిభాగయోగం

1. వినుము మానవులకు ప్రథమంబున నాహార విహార వ్యవహార శుద్ధివలయు.

2. అన్నపానంబులనగ నీయవనియందు
ప్రకృతిపురుషులు గావున వానిసేవ
పట్లశ్రద్ధయు భక్తియు వలయునుమ్మి
లేనిచో కల్గదారోగ్య మెప్పుడైన.

3. అన్నమును నీటిచే లోనికంపుటయును
ఇతరమును మందుచేత రప్పించుటయును
నాటుమను జుండెరుంగడు నాగరికుడె
దినదినము సాధనముజేసె తీరికగను.

4. గడియగడియకు టీ టిఫిన్ కాఫిజనుల
నిగ్రహంబులు జెఱచి యుద్రేకపరచు
గావ పిష్టాన్నమృష్టాన్న కంబులెల్ల
వేళ శిష్టాన్నములుగావు విధులదక్క.

5. సాత్వికాహార మానంద జలధిదేల్చు
తామసపుతిండి యుద్రేకతలను బెంచు.
గాననానంద సుఖముల గాంచనెంచ
తామసాహార దూరులై దనరవలయు.

6. ఇహము గోరంగ దేహంబు వృద్ధిపరచు
పరముగోరంగ నాత్మను వదిలపరచు
భోజనము గావలసియుండు భూజనులకు
తిండివిషయాన నిదియెరి గుండవలయు.

7. జిహ్వచాపల్యమెచ్చట చెలగుచుండు
గుహ్యచాపల్య మచ్చట కొనలుసాగు
సాత్వికాహారపరులకే సాధ్వసంబు
లంటజాలవు చిత్తజాయములయి.

8. తాను బ్రతుకంగ దినుటకు తగునుగాని
వైద్యులను బ్రతికించెడు ఖాద్యసమితి
మరుగనేటికి తనతోటి మనుజులెల్ల
నుప్పి దుపవాసములతోడ నొగులుచుండ.

9. నోరుచిరుదిండి గిర్నిగామారెనేని
పొట్ట బొగ్గుపులుసుగాలి బుడ్డియగును
తుందిలము మందుకొట్టయి తుదకుతనకు
సుఖము సన్నయిపోవును చూడజూడ.

10. చేలకునుమందు ఫలవృక్ష జాలములకు
కోళ్లుమేకలు గొఱ్ఱెల కొరకుమందు
నీళ్లలోమందు దవఖాన నీళ్లమందు
మందు వ్యామోహ మిడవలె ముందుగనుచు.

11. పుడమి నాచారహీనుడై నడుచుకొనిన
నర్థముంగాని వ్యాధుల నలమటించు
కావునను సదాచారము కారణము ని
రామయంబగు జీవితధామమునకు.

12. కనిపించిన ప్రతివస్తువు
తనకుం గావలయుననుచు తలచుటతగవే
తనకంటి పిచ్చిజగమున
తనగొంతుక కురిదగుల్చు తరిగొనివచ్చున్.

13. జనునిగృహమున జీవిత మునను గూడ
ద్వారమునననిల్చి చూడగా జనునుగాని
కిటికిగుండను తొంగుట మటు కెవరికి
కూడనటువంటి చేతయై కీడు దెచ్చు.

14. పాదరక్షలు గలవని వీధిలోని
పెంట గనకుండ నడుచుట పెద్దగాదు
తాను ద్రొక్కెడి పెంటనే తనదు జోడు
వెనికినుండియు పైజిమ్ము కనరుదాని.

15. ఒక్కవ్రేలెత్తి చూపిన యొరునితాను
ముడిగి తనవైపుజూపును మూడువ్రేళ్లు
పరులతప్పులు వెదకెడు పక్షమందు
నాత్మపరిశీలనము మొదటవసరంబు.

16. ఆహారవిహారాదుల పిమ్మట జనుండు వేషభాషాసహవా
సంబులయెడ శ్రద్ధవహింపవలయు.

17. రంగులెల్లను మనసుపై పొంగుజూపు
పిచ్చిరంగులు కంత్రీలు బెదురువన్నె
వానములు శాంతిగోరెడు వారలెపుడు
కోరకుండుటమేలు సంసారమందు.

18. పగటివేషంబువలె డాబు వగలు వోక
కాయమును గంపెడుడుపుల గప్పుకొనక
అర్హతను జాటు సామాన్య మైనయట్టి
వేషమేసుమి జనులకు విలువదెచ్చు.

19. అచ్చమగుభాష మాటాడుటది యొకకళ
కలగలుపుమాట గూడదు నలువకైన

దుష్ట మపశబ్ద మశ్లీలజుష్టమైన
భాషయు బడాయికోర్భాష వలదువలదు.

20. అతివినయము చూపించుట
మతినొక్కటి యుంచి పైకి మాటాడుట సం
గతిగాదెప్పుడు శ్రుతి స
మ్మతము దరస్మితముతోడ మాటాడవలెన్.

21. తనకు చుట్టమైన తగు బంధువైనను
ఆతతాయియైన యతని విడిచి
యన్యుడైననేమి ఆతము తాయి తో
చెలిమిచేయవచ్చు చెడ్డగాదు.

22. సహవాసంబు పిమ్మట నివాసంబును గనవలయు.

23. పగటికాలమెల్ల పనిజేసి పనిజేసి
యలసినట్టి జనుని నలతదీర
నిమ్మళంబుగాను నిదురించగా సొంత
యిల్లు వలయు నెంత హీనుడైన.

24. బ్రతుకు సొంత మద్దెభవనాల తెలవారు
యింతి కిల్లు దీర్చు నిగురమెల్ల
సమయు పంజరాన సాకుచు నున్నట్టి
చిలుక కెగురు నేర్పు తొలగినట్లు.

25. గృహంబున యజమానుల యభిరుచుల కాశయంబులకు దర్పణంబు గావున నిల్లాలు గృహనిర్వహణ కళ నెరింగి యుండవలయు.

26. నాగరికమైన యుగమిది నరునియింట
నెంతసామగ్రియున్నచో నంత హోద

కాని సామగ్రి యుండుటే ఘనతగాదు
వాని నిర్వహణము లేక వలదువలదు.

27. పనికి పనికిని యంత్రముల్ ప్రబలి నేడు
నరుని యంత్రముగా జేసె నాగరికము
చేతితో మోపినంతకు చేసికొనుటె
తరుచు యానంద మారోగ్య దాయకమది.

28. ఇంటి యవసరంబు లెన్నని మరునాడు
ఇల్లు తనకు చీకుముల్లు సుమ్మి
ఇల్లు దిద్దుకొన్న నిలయందె నాకంబు
దిద్దకున్న చెప్ప దీరదింక.



# 16. గుణత్రయవిభాగయోగం

1. అనంతరంబున నొకనాడు కుటుంబయ్య తమకుమారుని సమీపంబునకు బిలుచుకొని ప్రసంగవశంబున నిట్లు దెలిపె – మానవుండు –

2. అవగుణాలకు దూరమై యరుగువాడు
దుర్గుణాలకు దూరమై తొలగువాడు
సద్గుణాలకు చేరువై జరుగువాడు
వాడు – అగ్రగుణుండగు వాడుజగతి.

3. రాజగుణముగల్గ రంజిల్లు ప్రతివాడు
త్రిగుణము చేత తిట్లువచ్చు
కంత్రిగుణము చేత కలహాలు రేగును
గానసుగుణపరుడు గావలయును.

4. ఒరుల సుస్థితిపై "యీద" యొప్పుగాదు
తగనివాడైన "కసి" బూన తగవుగాదు
దాయగాడైన యగుగాక యావదగదు
అట్టివానిని యత్రిగా ననగవచ్చు.

5. బాల్యమందు సత్యభావంబు తోనుండు
రాజసంబు వయసు రాగగలుగు
తామసంబు పుట్టు తతిదప్పిముదిసిన
జనులకందరికిని జగతియందు.

6. సత్వగుణముచేత సకల కార్యంబులు
చక్కబడును సుమ్మిజగతిలోన
తామసంబుచేత తప్పునుపనులెల్ల
గాన దానితెరువు బూనజనదు.

7. గుణముమంచిదైన కులముతో పనియేమి
మానవత్వమొకటి మహితలాన
గుణవిభేదనంబు గొనకొని యేగద
కులములెల్లనేడు కుదురుకొనియె.

8. కర్మవశమున జనియించు కలినినరుడు
ప్రకృతి వశమున గుణమేదో పట్టుబడును
గుణముబట్టియు కర్మంబు కుదురుతనకు
నదియె యీనాటికులమయి యవతరించె.

9. మాధవుండు సృజించగా మానవులను
మానవుండు సృజించెను మతముకులము
పుటుకచేతను నరునికి మొగమునందు
కులము మతమను ముద్రలు గొట్టిలేవు.

10. భా యనగా ప్రకాశంబుగావున భారతీయుండు విజ్ఞాన రతుండగుటంజేసి యీసమాజ పురుషునకు బౌద్ధిక జీవియగు బ్రాహ్మణుండు ముఖంబుగా భుజబలంబు గల క్షత్రియుండు బాహువులుగా వ్యాపారంబున నగరంబుల భరించు వైశ్యులూరువులుగా సేవావృత్తిచే సంఘమును నడుపు శూద్రులు పాదములుగా భావింపబడిరి.

11. తలకు పాదములకు కలుగునే కులములు
ఆవిరాట్పురుషుని యవయవములు
బ్రాహ్మణాదులంచు బల్కనుగద శ్రుతి
హెచ్చుతగ్గులెట్లు నేర్పరింప.

12. అవని నరులందరొక్కటే యనెడువారె
యంగములబట్టి నెత్తురు రంగుబట్టి
యెన్నియో వర్గములుజేసి రిపుడుజనుల
వర్ణభేదంబులేలని వాదులాడి.

13. మహికి మంగళకైశికి మహిమజాటి
బ్రహ్మరాక్షసి శాపంబుబాయజేసె
నెవ్వడా దాసరయ్యను నెరుగలేరె
హరిజనుడు నిజమతడు శ్రీహరిజనుండు.

14. శంకరుని కులమడిగిన చండిదాసు
ధరణి శ్రీభాష్యకారుల ధర్మదాసు
కనగశ్రీరాఘవేంద్రుని కనకదాసు
యెవ్వరో యెంచిచూడుడి యెవ్వడైన.

15. ముట్టరానివాడు కుట్టినచెప్పులు
తొడుగవచ్చు నింటవిడువవచ్చు

కానివాని దాకగాదన్న న్యాయంబు
నెటుల మెచ్చవచ్చు నింతగనుడు.

16. భారతమునందు బుట్టిన వారలెల్ల
బ్రాహ్మణులె తొల్లికర్మవిభాగవశత
పంచవర్గాలుగా నైరి పంచజనులు
గానిచో శూద్రులందెట్లు జ్ఞానులుంద్రు.

17. జన్మచేతను శూద్రులుజగతినెల్ల
కర్మచేతను ద్విజులుగా గలరువారె
జ్ఞానముంబట్టి బ్రాహ్మణ గణములగుదు
రనగ నికనెన్న కులమేది మనకునొకటి.

18. కులముకులమటంచు గునిసెరుగాకను
కులముగలదె ఋషుల కులమునకును
కలిని నైదువేలు గడచినపిమ్మట
వర్ణసంకరంబు వారెయనిరి.

19. కృతను బ్రాహ్మణ ప్రాధాన్య మెసగుకతన
మరి వశిష్టాదులెల్ల బ్రాహ్మణులు నైరి
కలిని శూద్రప్రధానంబు గాననేడు
బ్రాహ్మణులె శూద్రమార్గంబు బట్టవలసె.

20. ఉద్యోగంబెంత యున్నతంబైనదే యగుగాక నది
సేవయే యనందగు సేవావృత్తి శూద్రధర్మంబు
గాన నిపుడగ్ర వర్ణంబులందరియందు శూద్ర
ధర్మేచ్ఛా బాహుళ్యంబు గనిపించు.

21. జాతిధర్మంబు లేనాడు జడనువడియె
నపుడె కులమంతరించె నీ యవనియందు
గుణము శీలమె యీనాటి మనుజులందు
నుత్తమాధమ నిర్ణయ ములకుభువిని.

22. విశ్వమానవ మాత్రుల వీధులందు
భారతావని తలవంపు పాలుసేయు
నట్టి యస్పృశ్యతా కళంకంబు నేడు
కడుగు కొనవలె మనవారు కన్ను దెరిచి.

23. మూర్తిగా మలచిన శిలను పూజించుచు శిల్పిని
నిరాదరించుట శ్రమించి పండించిన పంట ననుభవిం
చుచు రైతును రానీయకుండుట సజీసంబు పై యాసీను లై
జపంబు సల్పుచు దానినుపయోగ యోగ్యంబుగ జేసిన
వానిని దూరీకరించుట సంభావ్యంబులుగావు.

24. చాకితనబట్ట బతుకని సమయమందు
మంగలి ముఖంబుగీయని పక్షమందు
కులమతంబులు సేవించు కొనునె తనను
నాయకుడుగాని యతడెంత నరుడుగాని.

25. భారతీయుడెపుడు బ్రాహ్మణుడును గానె
మనుటయొప్పనుమ్మి మహితలాన
నటుల బతికినపుడె యాతనికిహపర
సార్థకమ్ము గలుగు జన్మమునకు.

26. తనశుచియును తనశుభ్రత
తన విద్యయు తనగుణంబు తనుభూషింపం
గనుజేయు జగమునందున
కనుక తనను తాను మొదట కనుగొనవలయున్

27. ఉతుకనపుడెంత విలువైన యుడుపులైన
మాసి కంపునెగొట్టును మనుజుడంతె
ఎంతకులమున్న బలమున్న నేమిగాక
యెఱుగవలె శూద్రగణములీ యెఱుకనెపుడు.



6. నిష్క్రియము నిశ్చలంబయి నిలిచిసాక్షి
మాత్రమై మూలబేరంబు మానవులకు.
నేమిదెల్పునొ తత్త్వంబు నెరుగలేరు
దినదినంబును దర్శించు కొనుచునున్న.

7. ఎవరు తానెక్కడుండెను ఎందుకొరకు
పుట్టెనో కారణంబేమొ పుడమిలోన
ఎప్పుడైనను చింతించి యెరుగబోరు
ఇల్లు సరిచూచు కొనుటందె తెల్లవారు.

8. బాల్యమున లేని యింద్రియ పాటవంబు
వయసులోనిచ్చి లోకాను భవముకొరకు
పుచ్చుకొనుచుంతు మరలనా ప్రౌఢతనము
ధాత యపుడైన కన్నుల మూతవిడరు.

9. మానవుండు బాల్యంబున బ్రహ్మచర్యం బవలంభించి విద్య నార్జించవలయు. యౌవనంబున వివాహితుండై సంసారభోగంబు లనుభవింపవలయు. వయసు వ్రాలు చుండ సంసారంబు సంతానంబున కప్పగించి గృహా రామ బంధంబులం ద్రెంచుకొని నేకాంతంబు గోరి భార్యతో వనప్రస్థుండు గావలయు ననంతరంబున నిరువురు సన్యసించి తపోయోగ నిరతులు గావలయు నిది యార్షజీవన పద్ధతి.

10. మతము పేరుతోడ మౌఢ్యాన బడకుండ
కులము పేరుతోడ క్రుళ్లకుండ
మానవత్వమెంచి మనవలె మనుజుండు
సకల శాస్త్రములను సారమదియె.

11. అనిన కుటుంబయ్య స్వామీ కులమతంబులు బ్రహ్మ
సృష్టియేగదా యనుడు నామూర్తి.
మతంబనగా నెట్టిదో వినుము-

12. నల్లమందుగాదు తెల్లమందుంగాదు
మతమనంగ ప్రజకు మహితలాన
సత్యమార్గమేదో చాటించునదిగాని
మిత్తిదారిజూపు మిడిసినేడు.

13. కులము మానవసేవకు నెలవు జూప
మతము మాధవుజేరగా బాటజూపు
తత్వమిట్టులుండ తరలిరి దవుదవ్వు
తలలుగొట్టుకొనుచు తత్వవిదులు.

14. మధ్వ రామానుజాదులు మతముమిదిరి
మాదిగలు నంత్యజులటంచు వాదుబడిరి
మతముదేవుడెరుంగును మనుజులుతమ
గొప్పలంగోరుచును గోతగొట్టిరిట్లు.

15. మతముకంటెను నీనాడు మానవునకు
దేవునెరుగుటయే యిలతేలికగును
వేదవాదాలతోకంచె వేసినారు
లోననరులకు చొరవీలుగానిరీతి.

16. అస్తినాస్తిచికిత్సలీ యవనియందు
పగలుచీకటిసుమీ పరస్పరము గనగ
పోషకములొంటి కొకటినాభాసుగావు
నింతగనలేక వాదులాడేరు జనులు.

17. జ్ఞానమును కర్మమును భక్తికరణి నెవడు
మూడుమతములకును పొత్తువేడుకగను
గాంచునోవాడె మతతత్వ గహనమందు
దారిగనియేగునట్టి యధ్వగుడుసుమ్మి.

18. తల్లిమతములోని తత్వంబుగనకుండ
పరమతంబుకొరకు భ్రాంతిబడుట
అమ్మనిడిచిపెట్టి యిమ్మహి పెద్దమ్మ
జేరుటనగజెల్లు చెనటులగుచు.

19. ఇక మానవుండేవిధంబుగా నడుచుకొనిన నుత్తముండ
నంబడునో తెలిపెదవినుము.

20. ఆలుపిల్లలు సంసారమనుచు నరుడు
పుడమిలోనెంత జేసినకడువబోదు
గాన సంసారమొకయెంత కాడనిలిపి
సార్వజనికోప కార్యముల్ సలుపవలయు.

21. బడినిబెట్టించు మూరిలో గుడినిగట్టు
భుక్తిముక్తికి సోపానములగు నవియు
బావియో చెర్వొత్రవ్వించు పౌరులకవి
జీవనాధారమై నిన్ను చెప్పుకొంద్రు

22. పండ్లతోటలు వేయించు పండితులకు
నిండ్లుగట్టించు మరి చలివేంద్రముంచు
సత్రములుబెట్టు వటులకు సాధువులకు
భువిని మానవసేవె మాధవునిసేవ.

23. ఊరక ప్రజోపకారము నొనరుపు మన
చేయునెవ్వడు ఫలమేమి చెందకుండ

గానవార్యులు సప్తసంతానములుగ
నలువురకు నక్కరగుపనుల్ నలుపుమనిరి.

24. పడినగుడి బాగుసేయుము చెడినపడతి
నుద్ధరింపుము దిక్కులేకున్న శవము
సంస్కరింపు మనాథను సాకు మిట్టి
యనఘ పథమున జనువాడె యార్యుడగును.

25. శీలవంచిత లైనట్టి చేడెలయెడ
కాయముంగాక మనసును గాంచ గలిగి
ఉద్ధరింపంగ ముందుకు నురుకువాడె
పతిత పావను డనునట్టి నుతికి తగును.

26. ప్రేమయను పెండ్లియను పేరకాముకులకు
మోసపోయిన వారిని పాశవికులు
శీలముం గొన్నవారిని చిన్నచూపు
చూచుటన శీలవంతుల చొప్పుగాదు.

27. పుట్టినప్పటి నుండియు గిట్టువరకు
కాలిబాటన కాపురాల్ గడుపువారి
స్థితులు మారవు స్వాతంత్ర్య సిద్ధినంది
మూడుపదులాయె నికనేమొ ముందుముందు.

28. రేపుమాపును దారిద్ర్యరేఖ దిగువ
క్రమ్గుచున్నట్టి బడుగుల మానవతచె
ఆదుకొనరేని ధనవంతులైన వార
లుండి ఫలమేమి దేశాన దండుగలకు.

29. కొండలను పిండిగొట్టెడి కూలివారి
పైని పెత్తనములు జేసి పైని పైని

మేడలంగట్టు వారలు పీడకలలు
గాంతు రందున సుఖనిద్ర గాంచలేరు.

30. బానిసలు వెట్టివారలు బ్రతుకు దెరువు
చెడిన వారలు భిక్షమ్ము లడుగువారు
మనుజులనుమాట మరచిన మానవతకు
మచ్చుతునుకైన ఫలమేమి లచ్చిమగలు.

31. సౌలు నక్కీలు పలికెడు జాతకులకు
మొద్దు గొట్టెడి వారికి ముద్ద దుడ్డు
మారదీ నాటికీ స్థితి మాటగాదు
శ్రమకు విలువీయని జగాన శాంతిలేదు.

32. ధర్మకార్యాలు తలపెట్టి ధరణియందు
చేయువారెల్ల పరిపూర్ణ శ్రీపతులు - త
దన్యులెల్లరు నిరుపేద లనగ వశమె
చిత్తము ప్రధాన మగుగాని విత్తమగునె.

33. ఎవరికెవరుగారు నెరుగుము పరమున
కందరందరకును నగుచు నుండ
వలయు నిహము కొరకు కలియుగమందున
నొంటిగాని కొకటి యుండబోదు.



# 18. మోక్షసన్యాసయోగం

1. వినుము పురుషునకు ప్రకృతిని భోగించుట యందానం దంబుండు అతండు దానిని సర్వేంద్రియంబులతో ననుభవించు నిది రసానందంబు. ఇంద్రియంబు లుప సంహరించుకొని మనస్సు నంతర్ముఖం బొనర్చినపుడు భోగరహితంబైన యానందం బబ్బు. అదియ బ్రహ్మా నందంబు.

2. మోక్షపురుషార్థమునకు దాముందు నడువ
మధ్యమ పురుషార్థములకు మన్నికగును
గాని నాడవి మధ్యమేగాక నెటుల
అర్థకామంబు లనిపించు సార్థకముగ.

3. ఆరు రుచులతోడి యాహారమొక చవి
ఉప్పులేని తిండి చప్పని చవి
తినగతినగ చప్ప దనముననే చవి
యటువిరించి రమణ మమరుచుండు.

4. ఎంత జదువనంత యెత్తున కెగురును
లోకవిషయమందు ప్రాకటముగ
నెంత జదువనంత గుంతలోనికి దిగు
తత్త్వవిషయమందు దార్శనికుడు.

5. మానవుండు మోక్షంబున కెప్పు డర్హు డగు నంటేని - మోక్షంబు గూడ నక్కరలేదను నంతటి నిస్పృహా త్వంబు గలుగవలయు నదియె నిక్కమగు మోక్ష సన్యాసంబు.

6. పాము గరచిన వానికి వేముతీపి
సరణి చందాన సంసార సర్పదష్టు
డైన వానికి విషయాళి హర్షమిడును
కాని వారికి నవియెల్ల గరళసమము.

7. బ్రతికినంతకు లోకాన పాడివిడక
యనుభవింపగ దగినంత యనుభవించి
పాలుద్రావి గరత్రము పారవైచు
నటుల సంసారమును విడనాడవలయు.

8. సర్వభూత సమత్వమె చాలదు భువి
సర్వదైవ సమత్వంబు సర్వమత స
హిష్ణుతయు గల్గినప్పుడే యిల నరుండు
నరుడుగా నిల్చు లేక పామరు డతండు.

9. ఎంత కల్లోలమో పైన నంత శాంత
మంతరంబున సంద్రాన నలరుగాన
కాపురంబున తాకట్లు గంపెడున్న
నుల్లమాతీరు గలవాడు యోగిసుమ్మి.

10. బ్రతికినంతకు బంగరు పక్షియగుచు
చచ్చి కాకిగ నగుకంటె సర్వకాల
మేకరీతిగ నుండెడి నెరుక నెరుగ
నట్టి నరజన్మ మెందుకు చెట్టగాక.

11. కాయమున నెంతవరకుండు కాపురంబు
నరయ జీవాత్మ పరమాత్మ యంతవరకె
కాపురంబిల్లు పిల్లలు కడకు నెవరి
కెవ్వరగుదురొ కాలమే యెరుగు సుమ్మి.

12. జనకచక్రవర్తి చాడ్పున నెవ్వండు
రాజభోగసౌఖ్య రాసి నడుమ
తా విరాగియగుచు తగులక నుండిన
వాడు రాజయోగి బ్రహ్మవేత్త.

13. కాంతనేకాంత మందున గాంచి యెవడు
శుకునివలె నిస్పృహతను నా జోలి తనకు
బట్టకుండగ నిలుచునో బయలునందు
వాడె పో బ్రహ్మవేత్తన వసుధయందు.

14 కాంతలను గాంచినప్పుడు కనగ నెవడు
కాంచ నాంబర ములగాంచి కాంతయెవతె
మనసు పరుగెత్త నీకుండు మహితలాన
నిగ్రహమునకు వారె పో విగ్రహములు.

15. ఎవ్వడున్మత్తుడై జగంబెరుగకున్న
తరిని గూడను శంభుని మరువలేడొ
అతడు నిజమైన సిద్ధుండు అతడుయోగి
అపర శంకరుడాతండు అతడభవుడు.

16. దీనమగు కూయి యేప్రాణి దైనగాని
వినగ నెవ్వని హృదయంబు వికలమగునొ
అతడె నిజమగు మానవుం డవని నఖిల
ప్రాణి భాషలెరింగిన పండితుండు.

17. అద్దమందు వోలె నాత్మదర్శనమును
ఎదుటివాని యందు నెవడు జేయు
నతడె పండితుండు అతడె బ్రహ్మజ్ఞాని
యతడె శంకరుండు అవనియందు.

18. కనులు గనరాని యట్టుల గాక మునుపె
తాను జగమును జూచుట మానవలయు.
చెవులు వినరాని యట్టుల చెలగు మొదలె
తాను లోకము వినుటను మానవలయు.

19. కావున నీవింక దేశికుని సన్నిధింజేరి కారణంబు వదయుము. ఇంతకాలంబు నన్ను భక్తితో పూజించి నందుల కిపుడు నీ శ్రద్ధానుష్ఠాన ఫలంబు వలన శుక మహర్షివలె ముక్తసంగుండవై ముక్తింగోరి వెళ్ళవల సిన సమయం బాసన్నంబైనదని సెలవిచ్చినంత కుటుంబయ్య కనులు దెరచి తన భావనామూర్తి యెరిం గించిన విషయంబుల కబ్బురపడి యపుడు గురుసన్నిధి కరిగె గావున.

20. భీషకాలంత గుర్తుతో సింహమంత
దొంగయైనను భటులకు దొరికిపోవు
కర్మయందు సకామత్వ మర్మమంతె
చిటుకలో జన్మ చేతికి చిక్కుచుండు.

21. మర్రివిత్తనమున పెన్మ్రాకు బుట్టు
నటు సుమీ కర్మ శేషమావంతయైన
చుట్టుకొను నింతసంసార మట్టిమెడకు
కాన ఫలకాంక్ష వదలిన కర్మవలయు.

22. పాలలో వెన్నవలె నుండి ప్రాయమందు
చల్లలో వెన్నవలె దేల చరమ దశను
అదియెపో రాజయోగ మనంగ జెల్లు
పుడమియందున నెంతటి బుధునకైన.

23. నేతి నేతివాక్య నిర్ణయముల చేత
పాలలోనినేయి వడసినట్లు
పట్టవలయుజగతి పరతత్త్వవస్తువు
పట్టినంత పరము పట్టువడును.

24. ప్రకృతికంటెను పరమైన బ్రహ్మతత్వ
మందునె ప్రకృతిలోని ప్రమాణములకు
ప్రాథమిక సూత్రమెరుగని పలుకుగాక
నేటివిజ్ఞాన వేత్తల నిజములెల్ల.

25. ఏవిద్యనెరింగిన సమస్తవిద్య లెరింగినట్లగునో యట్టి
బ్రహ్మవిద్య నెరుంగ నిచ్చవొడముట నీపురాకృత జన్మ
విశేషంబు, ప్రజ్ఞానంబ్రహ్మమ్మని శృతివచనంబుగాన
నీవిద్యప్రకృతి పురుషవివేక కారణంబైన సాంఖ్యంబుచే
ప్రారంభంబగు. కుటుంబయ్య గురూపదేశంబున జప
ధ్యానపూర్వకంబైన తారకంబున నిష్టదైవంబు నుపా
సింపనతండేమిచెప్పెవింటివిగదా।ముక్తినిగోరునరుండ్లు.

26. నిష్ఠయందు దినంబంత నిలుచుటరుదు
నిష్ఠచాలించ చిత్తంబు నిలుచుటరుదు
గానచిత్తంబునకు దగు కర్మమేదొ
దైవికమొ సాంఘికమొ యొందు ధన

27. ఆ కారణంబుననే బ్రహ్మజ్ఞాను...
కర్మంబు జేయనవసరంబు
హార్థంబైన కర్మం బవలంబి
మనస్సు ప్రాణాయామ
ముద్రలచేగానిఛాయాపురుషై

విరహితంబు గానేరదు. గాన దాని నజపగాయత్రి పై కేంద్రీకరింపవలయు అపుడది దానిని గమనించుచు తననుతాను విస్మరించు. ఆస్థితినే యోగు లమనస్కం బందురు.

28. విజ్ఞాలమనస్కమన చిత్తవిభ్రమంబు
తొలగి మాలిన్యములువిడి నిలుకడగను
మనసునిలుచుట యంత్రడు నిమ్మహినిగాన
మనసువశమైన చాలును మాయగెలువ.

29. అజపగాయత్రియన నాసికా రంధ్రంబులనుండి చరించు ప్రాణపక్షి. అదిలోపలికి వెళ్లునపుడు "సో"యని సకార వెలుపలికివచ్చునపుడు "హమ్మ"నిహకార పూర్వకం బుగా సంచరించు. నరుండుదానిని గమనించు చుండిన యెడల.

30. బోయకు మరామరాయను ప్రొద్దునందు
రామనామంబు బలికిన లాగుసోహ
మున నతనికహంసః యటనివిలోమ
గతిని నద్వైత భావంబు మతికిదట్టు.

31. సాధకున కెపుడద్వైత భావంబుగుదురు నపుడతని కచల దర్శనంబగు. అదియంతట నిండియుండుటంబట్టి పరిపూర్ణంబనంబడు. దానినే వేదాంతులు బ్రహ్మంబని వక్కాణింతురు. అతిరహస్యంబు బట్టబయలనుట వినియుందువుగదా! ఎవనికి పరబ్రహ్మదృష్టి యలవడునో వానికి క్రమంబుగా కార్యకారణ రూపంబైన మనసుల యించు తత్వజ్ఞాలు దానినే యమనస్కంబందురు. నరుండమనస్కస్థితి నందిన పిమ్మట యెరుకను విడువ

వలయు సగుణవాదులు దానినే మాయనుండి విడువడుట యందురు.

32. ఈతవచ్చిన పిదప బెండింకనేల
నదినిదాటిన పిమ్మట నావయేల
ముల్లుదీసికొనిన సూదిమళ్లియేల
ఎగిరినంతట పరిపూర్ణ మెరుకయేల.

33. కాయలేవైనను పండిన పిమ్మట నందలివిత్తనంబులు కండకంటె వేరైయుండునట్లు మతమేదైనను పరమ జ్ఞానులు సంసారమున నుండియు దానికంటె వేరై యుందురు తల్లికడుపున శిశువుమావిచేతనే వర్ధిల్లినను పూర్ణుడైన పిమ్మటదానిని ఛేదించుకుని యుదయించినట్లు జ్ఞానపూర్ణులైనవారు తమనావరించిన మాయను ఛేదించు కొని స్వతంత్రులగుదురు.

34. ఎరుకను విడువకనుండిన
నరునది మరలంజగత్తు నందున త్రోయున్
పరిపూర్ణము మరపించున్
మరణభయము చేతనతని మర్త్యునిజేయున్.

35. కావున పరిపూర్ణం బెరింగినను యెరుకను విడువక లాభంబులేదు. మాంత్రికుని మంత్రంబున జనుని పీడించు భూతంబు తొలగిచనినట్లు పుంస్త్వముడిగిన నరునియెడ కాంతలు వలపు నిలువక మసలినట్లు సద్గురు కటాక్షమున జ్ఞానపూర్ణుడైన వానిని మాయ తనంతట తానే తొలగి యంటకుండ నిలుచు. అతడు సంసారమందున్నను ప్రకృతి యతని నేమిచేయజాలదు.



# iv. ఉపసంహారం

1. కృష్ణాచార్యా! వింటివిగద. ఇది కుటుంబయ్య సంసార వృత్తాంతంబు.

2. మహినిగల శక్తులెన్నుండు మాధవునకు
నన్నిటినిగూడ సాధింప నవనియందు
మనుజ కాయంబునకె సాధ్యమందువలన
జన్మములలోన గాననీ జన్మవరము.

3. మహినివిజ్ఞాన ఘనమైన మనుజదేహ
మందినెవ్వండు బ్రహ్మంబు నందుకొనడొ
వాడు నరపశువా యరపశువుగాక
కాళ్లునాల్గును తోకయు గలుగకునికి.

4. ప్రాణితతికెల్ల భౌతికావసర మాత్ర
ప్రజ్ఞనిడి మానవునకది ప్రకృతియెక్కు-
విడగగతమేమి తనలోని నీశ్వరుగని
తానతని జేరుటకుగాక ధాత్రిలోన.

5. మానవుడు సుఖముంగోరి మాపురేపు
కష్టపడుచును కాలంబు గడుపుచుండు
ఎపుడు మృత్యువు కెరయానొ యెరుగలేడు
అయినదానిని తలవడావంతయైన.

6. తల్లికడుపునుండి తాపూర్ణుడై పుట్టి
వెలితిబ్రతుకు బ్రతుకు పృథివిలోన
నిండుగాను బ్రతుక నేరకనేవేవొ
యితరమెన్నినేర్చి యేమి ఫలము.

7. అన్నికోణంబులను రత్నమైనగాని
భువి ప్రకాశింపనేరదు బుధులునంతె
నెవరికెంతిచ్చు ప్రతిభ నాయీశ్వరుండు
అంతెగాకన్నిటను వాసినందలేరు.

8. మహిని ప్రతివానికొక పుట్టుమచ్చయుండు
గాని యందరియందవి గానబడవు
కనబడుచునవ్వి శోభించ గలుగుటన-న
దృష్టమేసుమి చూడగా సృష్టియందు.

9. అనిబోధించిన కృష్ణాచార్యుండు శ్వశురునకు వినయ
వినమిత గాత్రుండై ప్రణమిల్లి నాటినుండి యచంచల
భక్తిచే నిరువది వత్సరంబులుసేవించి క్రమంబుగా
సాంఖ్య తారకామనస్కంబు లెఱుంగుచు నచలుండై
సంసారంబుసల్పె-

10. సుతను తగినట్టి యింటికి స్నుషనుజేసె
సుతుల జదివించి యుద్యోగ యుతులసల్పె
తగిన సంబంధములతో లగ్నములుగూర్చె
నిండ్లుగట్టించె వారికి హితమెరింగి.

11. బాధ్యతల నొక్కటొక్కటి బరువుదింపు
కొనుచు నరువది యేండ్లుగా ననువుమీర
షష్టిపూర్తిని సార్థక చరితుడగుచు
జరుపుకొనె దోసపాదుగా సాగనిల్లు.

12. కలువకుర్తిని వేంకటు నిలయమందు.
క్రతుని కర్పితమని రెండు గదులుగట్టి
నిప్పుడీకృతి వ్రాయించెనింతిపైనె
సప్తసంతానవరులుగా జనునుగాన-

13. ఈలోపల నొకనాడు లక్ష్మయార్యుండల్లుని వినయ
విధేయతలకు సంతసించి.

14. పోలకమువల్లి కృష్ణయ
నీలాగునన చలమెరుక నెరిగినవారీ
కాలమున కోటికొక్కరు
చాలగ నమ్మంగలేరు సత్యమెరుగకన్.

15. నీవంటి శోధనీయుని
యేవంకన్ గానలేక నెంతోచింతన్
గావించు చుంటినెప్పుడు
గావున సంశయముదీరెగద నీవేళన్.

16. గురుభక్తి కలిగియుండిన
నరునకు నుపదేశమీయ నగునార్యులకున్.
గురుభక్తిలేక యుండిన
నరులకు నుపదేశమీయ నగుబాటులగున్.

17. కనుము కారణాధి కారంబునిచ్చితి
మద్గురూపదేశ మార్గమెల్ల
నిర్వహించుమంచు నీతోడజెప్పుచు
మరువకుండు మెంతమాత్రమైన.

18. ఎవ్వరైనను నుపదేశ మీయుమనిన
వారిమనసును శోధించవలయుముందు
అడిగినప్పుడె జెప్పుట యనినతగదు
బూడిదను నెయ్యిబోసిన పోలికగును.

ఇట్లు
చేవూరు పెద్దలక్ష్మయాచార్యులు

19. తేది. 13–6–1965
విశ్వావసు జ్యేష్ఠబహుళ విదియ
అనియిట్లు జామాతకు పత్రపూర్వకంబుగా
కారణాధికారంబిచ్చె నిది నేనెరింగినతెఱంగు.

20. మంగళంబు చేపూర్వంశ మహితరుచికి
మంగళం బెల్లయార్యుని యంగజునకు
మంగళము రుక్మిణమ్మ కుమారమణికి
మంగళము లక్ష్మినరసాంబ వల్లభునకు.



## V. అంకితం

1. అన్నా కృష్ణాచార్యా!
యెన్నాళ్లదో యెరుగజాల మీయనుబంధం
బిన్నాళ్లకు నీవిధినం
పన్నంబై హృదయములు సువాసనగుప్పెన్.

2 అన్నా! నన్నొకకృతిని
మ్మన్నా వదినీకుగాక నర్ధాంగికిమా
చిన్నవదిన రత్నమ్మకు
అన్నువకున్ స్మరణికగ నవాక్షరరీతిన్.

3. ఇదినీ హృదయమునందున
పదిలంబుగ దాగినట్టి పత్నిప్రేమా
వధికి సువర్ణవితర్దిక
మదియెత్తిన వైజయంతమై యలరారున్.

4. అన్నా మీసంతానంబు నలువురు మీసంసార తరువు వేసిన శాఖలు ఒక్కడు రమామణి సనాథుండైన రామగోపాలుండు, ఒక్కండు సుశీలా వాల్లభ్యముగల పరమేశ్వరుండు, ఒకడు సరస్వతీ విభుత్వమున విద్యాసాగరుండు; కూతురువామనున కర్థాంగియైన లలితాదేవి వీరందరు పుత్ర పౌత్రాభివృద్ధిగా వర్ధిల్లవలయునని కోరెద.

-ఇది సంసార క్షేమంబుగోరు నాభావవాహిని, నాలోని వానిగీత తరతరంబులుగా నీజీవుండు కనుచు వినుచు జీర్ణించుకున్న నీభావంబులు గురుజనసేవా శుశ్రూషాలబ్ధవర్ణంబులుగాని యిందు నాసొంత మావంతయు లేదు.

మంగళము పండితాళికి మాన్యులకును
మంగళము కవిగణాలకు మహితులకును
మంగళము కావ్యలోక మర్మజ్ఞులకును
మంగళము కావ్యపాఠక మండలికిని



13. ఈలోపల నొకనాడు లక్ష్మయార్యుండల్లుని వినయ విధేయతలకు సంతసించి.

14. పోలకమువల్లి కృష్ణయ
నీలాగునన చలమెరుక నెరిగినవారీ
కాలమున కోటికొక్కరు
చాలగ నమ్మంగలేరు సత్యమెరుగకన్.

15. నీవంటి శోధనీయుని
యేవంకన్ గానలేక నెంతోచింతన్
గావించు చుంటినెప్పుడు
గావున సంశయముదీరెగద నీవేళన్.

16. గురుభక్తి కలిగియుండిన
నరునకు నుపదేశమీయ నగునార్యులకున్.
గురుభక్తిలేక యుండిన
నరులకు నుపదేశమీయ నగుబాటులగున్.

17. కనుము కారణాధి కారంబునిచ్చితి
మద్గురూపదేశ మార్గమెల్ల
నిర్వహించుమంచు నీతోడజెప్పుచు
మరువకుండు మెంతమాత్రమైన.

18. ఎవ్వరైనను నుపదేశ మీయుమనిన
వారిమనసును శోధించవలయుముందు
అడిగినప్పుడె జెప్పుట యనినతగదు
బూడిదను నెయ్యిబోసిన పోలికగును.

ఇట్లు
చేపూరు పెద్దలక్ష్మయాచార్యులు

19. తేది. 13–6–1965
విశ్వావసు జ్యేష్ఠబహుళ విదియ
అనియిట్లు జామాతకు పత్రపూర్వకంబుగా
కారణాధికారంబిచ్చె నిది నేనెరింగినతెఱంగు.

20. మంగళంబు చేపూర్వంశ మహితరుచికి
మంగళం బెల్లయార్యుని యంగజునకు
మంగళము రుక్మిణమ్మ కుమారమణికి
మంగళము లక్ష్మినరసాంబ వల్లభునకు.



## V. అంకితం

1. అన్నా కృష్ణాచార్యా!
యెన్నాళ్లదొ యెరుగజాల మీయనుబంధం
బిన్నాళ్లకు నీవిధినం
పన్నంబై హృదయములు సువాసనగుప్పెన్.

2 అన్నా! నన్నొకకృతిని
మ్మన్నా వదినీకుగాక నర్ధాంగికిమా
చిన్నవదిన రత్నమ్మకు
అన్నువకున్ స్మరణికగ నవాక్షరరీతిన్.

3. ఇదినీ హృదయమునందున
పదిలంబుగ దాగినట్టి పత్నిప్రేమా
వధికి సువర్ణవితర్దిక
మదియెత్తిన వైజయంతమై యలరారున్.

4. అన్నా మీసంతానంబు నలువురు మీసంసార తరువువేసిన శాఖలు ఒక్కడు రమామణి సనాథుండైన రామగోపాలుండు, ఒక్కండు సుశీలా వాల్లభ్యముగల పరమేశ్వరుండు, ఒకడు సరస్వతీ విభుత్వమున విద్యాసాగరుండు; కూతురువామనున కర్ధాంగియైన లలితాదేవి వీరందరు పుత్ర పౌత్రాభివృద్ధిగా వర్ధిల్లవలయునని కోరెద.

-ఇది సంసార క్షేమంబుగోరు నాభావవాహిని, నాలోనివానిగీత తరతరంబులుగా నీజీవుండు కనుచు వినుచు జీర్ణించుకున్న నీభావంబులు గురుజనసేవా శుశ్రూషా లబ్ధవర్ణంబులుగాని యిందు నాసొంత మావంతయు లేదు.

మంగళము పండితాళికి మాన్యులకును
మంగళము కవిగణాలకు మహితులకును
మంగళము కావ్యలోక మర్మజ్ఞులకును
మంగళము కావ్యపాఠక మండలికిని





